జిల్లెళ్ళమూడిలో

# వింతలు - విశేషాలు





రచన

ఆచార్య ఎక్కిరాల భరద్వాజ

ప్రచురణ

శ్రీ విశ్వజననీ పరిషత్ - జిల్లెళ్ళమూడి.

జిల్లెళ్ళమూడిలో

# వింతలు విశేషాలు



రచన

**శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

ప్రచురణ

**శ్రీవిశ్వజననీపరిషత్ - జిల్లెళ్ళమూడి**

సర్వస్వామ్య సంకలితము

**11.11.2006 హైమవతీదేవి జయంతి**

**వెల : రు. 30**

**కృతజ్ఞతలు**

ఈ గ్రంథప్రచురణకు ఆర్థికంగా సహకరించిన

సోదరులు

శ్రీ వల్లూరు పాండురంగారావుకు

వారి కుటుంబ సభ్యులకు

ప్రతులకు

**శ్రీవిశ్వజననీపరిషత్ - జిల్లెళ్ళమూడి - 522 113**

**BAPATLA MANDALAM, GUNTUR DT. (A.P.) INDIA.**

☎ : 08643 - 227324

# మా మాట

మాతృశ్రీ మాసపత్రిక మొదలు పెట్టిన రోజులలో సోదరుడు శ్రీ ఎక్కిరాల భరద్వాజ జిల్లెళ్ళమూడిలో ఉండేవాడు. ఇంగ్లీషు తెలుగు పత్రికలలో అమ్మ వద్ద తను చూచిన వింతలు, విశేషాలు, అనుభూతులు వ్రాస్తుండేవాడు. అతని సునిశిత పరిశీలన, ఆధ్యాత్మికమార్గంలో అతని ప్రయాణం వాటిద్వారా తెలుస్తుండేది. మొహమోటం లేకుండా చెప్పే అతని మనస్తత్వమూ ఆ రచనలలో ప్రతిబింబిస్తుండేది.

బాల్యం నుండి పెరిగిన ఆధ్యాత్మిక వాతావరణంలో అతనికున్న అవగాహన, తన సత్యాన్వేషణలో అతను చూచిన క్షేత్రాలు మహనీయుల చింతన, ప్రత్యేకించి అరుణాచలం రమణమహర్షి, షిరిడీసాయిబాబాల ప్రభావం అతని మనసుపై ఏలా ప్రభావం చూపింది కూడా అతని రచనల ద్వారా తెలుస్తుంటుంది.

తండ్రి శ్రీ ఎక్కిరాల అనంతాచార్యులవారు, సోదరులు శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు, శ్రీ వేదవ్యాస వంటివారి సాన్నిహిత్యం కూడా అతనిని ప్రభావితం చేసినాయి.

ఏమైనా నిరంతర సత్యాన్వేషణ అతనిని ఎంతోమంది ఆధ్యాత్మిక సంపన్నుల వద్దకు తీసుకెళ్ళింది. ఆలాంటి ప్రయాణాలలోనే అతడు అమ్మ వద్ద కొన్ని సంవత్సరాలు ఉండటం జరిగింది.

మేధావంతమూ రచనా, నైపుణ్యమూ గల అతని వ్యాసాలు, భావాలు సోదర సోదీరమణులకు స్ఫూర్తిని కలిగించి అమ్మను గూర్చిన అవగాహనను పెంచ గలవనే ఉద్దేశ్యంతో ఆ రచనలను ఒక గ్రంథంగా తేవాలనుకున్నాం. పది వ్యాసాలు అతడే తెలుగులో వ్రాసినవి దొరికాయి. మరొకపది అతడి ఆంగ్లరచనలకు సోదరులు శ్రీ తంగిరాల కేశవశర్మ చేసిన అనువాదాలు దొరికాయి. ఈ రచనలన్నీ తొలిరోజులలోని మాతృశ్రీ పత్రికల నుండీ సేకరించినవే.

గ్రంథంగా తేవాలనే ఆలోచనకు బలం చేకూర్చినవాడు శ్రీ వల్లూరి పాండురంగారావు. దీని ప్రచురణకు అయ్యే ఆర్థికసహాయం తాను చేకూరుస్తానన్నాడు. ఇదిగో ఈ రూపానికి వచ్చింది అతడు అభినందనీయుడు.

ఈ లోకంలో లేకపోయినా శ్రీ భరద్వాజ ఈనాడు ఈ రచనల ద్వారా మన మధ్య శాశ్వతుడై మన మనః ఫలకాలపై నిలుస్తాడు. అతనికీ అతని కుటుంబానికీ కృతజ్ఞతలు.

**శ్రీ విశ్వజననీపరిషత్ - జిల్లెళ్ళమూడి**

# విషయ సూచిక

# జిల్లెళ్ళమూడిలో వింతలు - విశేషాలు

## 1. సర్వసామాన్యంలో విశేషం

మానవులలో మానవత్వం, దైవజ్ఞులలో దైవత్వం. తల్లులలో మాతృత్వం లోపించిన యీ రోజుల్లో వీటినన్నింటినీ పరిపూర్ణంగా తనలో అమ్మ యిముడ్చుకొన్నది. అవి ఆమెలో యీ విశేషం ఆమె మాటల ద్వారా, చేతల ద్వారా అనుక్షణం వెల్లడి అవుతూనే వుంటుంది దాన్ని గమనించగల వారికి. నావంటి సామాన్యునికి సృష్టిలోని పరిణామంలో విరామంలేకుండా బహిర్గతమయ్యే విశిష్టతలను గుర్తించే నిశితత్వం లోపించటం వలన ఆమె చర్యలు గాని, మాటలు గాని కొన్ని మాత్రమే అవగాహనకు వస్తాయి.

అన్నింటి కంటె ఆశ్చర్యం కల్గించే విశేషమేమిటంటే ఆమె ఒక క్షణంలో అంత విశిష్టంగా, వింతగా కనిపిస్తూ ఉన్నా మరుక్షణంలో సామాన్యుల కంటె సామన్యురాలుగా కనిపించటమే. ఒక్క క్షణం మాటల్లో, చేతల్లో, మౌనంలో, రూపంలో – అన్నింటిలోనూ ఇంత కంటె వేరే దైవం అంటూ ఏమీ లేదనిపిస్తుంది. మరుక్షణంలో వ్యవహారాలను నిపుణంగా చక్కబెడుతూ లౌకికజ్ఞానంలోనూ, యుక్తిలోనూ సర్వసమర్థురాలుగా వైరాగ్యానికి బదులు తాపత్రయం గలదిగా కనిపిస్తుంది. ఇంకొక క్షణంలో ఎంతో అమాయకురాలుగా, అతినిస్సహాయురాలుగా కనబడుతుంది. ఎవరికైనా కొద్ది తలనొప్పో, దగ్గో వస్తే విపరీతమైన ఆందోళన వ్యక్తం చేస్తూ ఏ వైద్యుని దగ్గరకో పొమ్మని తొందరపెడుతుంది. మనుషుల్లోని మంచితనం చూచి కళ్ళనీళ్ళు పెట్టుకొని సామాన్య మానవిగా కనబడుతుంది. చిన్న చిన్న చిక్కులను గూడా యెదుర్కోలేని బలహీనురాలుగా జాలి గొలుపుతూ పిన్నల దగ్గర నుండి పెద్దల దగ్గర వరకూ అందరినీ సలహాలడుగుతూ వారిలో కృత్రిమంగా కనబడే నమ్రత, నిరహంకారతల వెనుక దాగిన అహంభావాన్ని రెచ్చగొట్టి ప్రతి వ్యక్తి చెప్పిన సలహా పాటించి వాని అసమర్థత, అవివేకం ఇట్టివని (తప్పుకోవటానికి వీలులేకుండా) వానికి అవగాహన చేస్తుంది. అప్పటికిగాని తెలియదు. ఆమె నాటకం ఆడిందనీ, అది మనలో మనకు తెలియకుండా దాగిఉన్న లోపాలను మనకు అవగతం చేయడం కోసం అట్టా చేసిందనీ.

ఇది ఎంతో మందికి ఎన్నో విధాల అనేక పర్యాయాలు జరగటం ప్రత్యక్షంగా

చూచినా ఎవరికి వారు తమదాకా వచ్చేటప్పటికి చప్పగా జారిపోతారు. మన జాగ్రత్తలూ తెలివితేటలూ అక్కడ పనిచెయ్యవు. అది విశేషం.

భగవంతుడు మనచుట్టూ ఉండే ప్రకృతిరూపం దాల్చి అనుక్షణం ఇంద్రియాల ద్వారా మనకు అనుభూతం అవుతున్నా అది దైవస్వరూపమని తోచక దేవుడెక్కడో ఉన్నాడని అన్వేషిస్తూంటాము. ప్రకృతి అతిసామన్యంగా తోస్తుంది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని శాస్త్రం చెప్పనే చెప్పింది. అర్జునునికైనా శ్రీకృష్ణుడు అనుగ్రహిస్తేనే జ్ఞానం కలిగింది. ఈ సామన్యంగా వ్యక్తమయ్యే దానియందే మనకు వ్యక్తం కాకుండా దాగియున్న దాన్ని గురించి విచారిస్తారు ఋషులు. అందుకే వేదవ్యాసమహర్షి మహాభారతంలో "యత్తద్వ్యక్తస్థమవ్యక్తం విచిన్వంతి మహర్షయః" - అని వ్రాశారు. ఆ ప్రకృతిలాగానే అమ్మకూడా, "ఇది యేమిటి" అన్న అన్వేషణను మనకు కల్గించి గాలికి తలలూపే గడ్డిపువ్వులు సైతం సృష్టి రహస్యాన్ని తెలిపే జ్ఞాననిధులుగా తోచి సర్వప్రకృతిలోను దైవత్వం పొంగిపొరలుతున్నట్లు తోచేలా చేస్తుంది.

దీన్ని ఉద్దేశించేనేమో అమ్మ ఒకసారి "ఏం చెయ్యాలి" - అని యెవరో అడిగినిపుడు "సామాన్యంలో నుండి విశేషాన్ని విడదీసి ఆ విశేషాన్ని తిరిగి సామాన్యం చేసుకోవాలి" - అని అన్నారు. అంటే సర్వమూ అయి సర్వత్ర ఉన్న భగవంతుని అన్ని రూపాలలో గుర్తించడమే మనకు అతి సామాన్యం అనిపించే దానిలోని విశేషాన్ని గుర్తించటం. ఈ వస్తు సముదాయాన్ని 'సామాన్యమేగా' అని నిర్లక్ష్యం చెయ్యక అది దైవస్వరూపమన్న గుర్తును నిలుపుకోవటమే సామాన్యం లోని విశేషాన్ని విడదీయటమంటే. ఆ విశేషాన్ని తిరిగి సామాన్యం చేసుకోవటమంటే ఈ భావనను మనం ప్రయత్నపూర్వకంగా నిలుపుకోవలసిన స్థితినుండి అసలు మరపురాకుండా మనకు సహజమయ్యేలా ధారణచెయ్యడ మన్నమాట. అంటే సృష్టిలో ప్రతివస్తువూ దైవ స్వరూపమై "సర్వం ఖల్విదం బ్రహ్మ అన్న వాక్యం అనుభవంలోనికి రావాలి. ప్రతి స్వల్పవస్తువూ సర్వవేద, శాస్త్ర సారాలను చాటుతూ అంతా విశేషంగా తోచటం సహజం కావాలి. అదే ఆమెస్థితి.

అందుకే 'వ్యష్టి - సమిష్టి' అన్న ప్రశ్న వస్తే దాని నివారణకు తాను కట్టుకున్న చీరనో, కూర్చున్న మంచాన్నో ఉదాహరణగా తీసుకుంటారు. ఒకే దారం పడుగు పేకగా నేయబడి సమిష్టి అయిన చీర ఏర్పడటం, అందులోనే వేరువేరుగా ఉన్న దారపు పోగులు వ్యష్టికి రూపాలయి రెండూ ఒకే ప్రత్తితో తయారు కావటం - అంతా ఒక్కటే అన్న మహాసత్యం నిరూపితమవుతుంది" అని అంటారు.

అందుచేత అమ్మ సర్వసామాన్యంగాను, విశేషంగానూ కూడా కనిపిస్తారు.

## ౨. నేను మీలో దైవత్వాన్ని చూస్తాను

కొత్తగా అమ్మను చూడవచ్చిన వాళ్ళకు మానవిగా కనిపించే అమ్మను దైవంగా పూజించటం వింతగా తోస్తుంది. అమ్మ దయవలన అనేక దివ్యమైన అనుభవాలు కలవాళ్ళకు కూడా వింతగా తోచేదేమంటే అమ్మ ఒక్కొక్కప్పుడు తన పాదాల మీద వేసిన పువ్వుల్ని చేతుల్లోకి తీసుకుని తన పాదాలను తానే పూజ చేసుకోవటము. ఆ సమయంలో బిడ్డలు వల్లించే సహస్రనామాలను చాలా నెమ్మదిగా ఆమె కూడా ఉచ్చరిస్తూ తనలో తాను ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ ఉండటము. చాలాసార్లు నే ననుకొనే వాణ్ణి ఆమె వూరికే మనల్ని వెక్కిరించటానికి అనుకరిస్తున్నారని. కానీ ఒకసారి తోచింది - సర్వము తానే అయిన స్థితిలో లిప్తమాత్రం కూడా చలనం లేకుండా వుండే దివ్యమూర్తుల చర్యలు ఎంత స్వల్పంగా కన్పించినా వాటిలో మహత్తర సత్యాలు దాగి ఉన్నాయని.

ఇస్లాం మతగ్రంథమైన కోరాను, హిందూ మతగ్రంథాలైన సకల శాస్త్రాలూ భగవంతుడే అన్నింటిని సృష్టి చేసి నడిపిస్తాడని చెబుతాయి. మంచి - చెడు, ఈ రెండింటికీ కూడా దైవమే ఆధారమనీ మానవుని మనస్సు మంచిదారి తొక్కాలన్నా చెడుదారి తొక్కాలన్నా భగవత్సంకల్పమే కారణమనీ ఉద్ఘాటించడానికే కొరాన్‌లో "మమ్ములను పాపము నాచరింప చెయ్యక పుణ్యమార్గాన నడిపించమని ప్రార్థన కూడా వున్నది. అదే **"తమ సోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతంగమయ"** అన్న శ్రుతి వాక్యానికి కూడా అర్థం. మంచికైనా చెడుకైనా బుద్ధిని ప్రేరేపించు దైవశక్తిని **"థియోయోనః ప్రచోదయాత్"** అని చెప్పారు.

అంటే దైవము సర్వమూ తానే అయి, జీవుడు తానే అయి, వాడి బుద్ధి తానే అయి, దాని ప్రేరణ తానే అయి దైవభక్తి కూడా తానే అవుతాడు. భక్తుని ఉదాహరణంగా తీసుకుంటే భగవంతుని ధ్యానిద్దామన్న సంకల్పం తాను; ఆ సంకల్పం కల మానవుడూ తానే. అందుకే అమ్మ అన్నారు **"దైవ సంకల్పం కాదు సంకల్పమే దైవ"**మని. ఆ దైవమే భూమియై సకల వస్తువులై, వానిలో పూజాద్రవ్యాలు కూడా తానే అయి, పూజించే భక్తుడై, పూజ తానే తనను తానే పూజించుకుంటాడు. అజ్ఞాని దృష్టిలో దైవం వేరు తాను వేరు. కాని దైవదృష్టిలో భక్తుడు. భక్తి, పూజ అన్నీ తానే అయివుంటాడు. అదే అమ్మ తన పాదాలకు తాను పూజ చేసుకోవటంలోని భావం అని నాకు తోచింది. ఆ లీలలో అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతాలలోని ఏకత్వం ఎంత

చక్కగా వెల్లడి చేస్తారో అమ్మ ! నాకీ ఆలోచన మనస్సులో మెదిలిన క్షణంలో ఎవరో "మేము నీపాదపూజ చేసుకుంటామమ్మా" అని అడిగితే అమ్మ నన్నడిగారు - "అసలు పూజంటే ఏమిటి నాన్నా ?" అని. నా మనస్సులో మెదిలిన ఆలోచనలన్నీ క్రోడీకరించు కొని **"జరిగేదంతా పూజేనేమో; సృష్టే పూజేనేమో నమ్మా"** అన్నాను. **"అంతేగా"** అన్నారు. నాకు ఆ ఆలోచన స్ఫురింపచేసినది తన సంకల్పమని అర్ధమయ్యేలా చేస్తూ.

బిడ్డలరూపంలోని అమ్మ, జిల్లెళ్ళమూడిలో చిన్న కుటీరంలో తనతో తనకే పూజచేసుకుంటూ వుంటే ఎలా వుంటుందో ఆమెకు అని నాకాలోచన వస్తూంటుంది. **"ఆత్మకు ప్రతిబింబమే జగత్తు"** అన్నారు అమ్మ. అంటే తన ఎదుటవుండే సర్వసృష్టి లోనూ తనను చూసుకోగలగటమే. అమ్మ ఒకసారి దీన్ని బింబప్రతిబింబన్యాయమని చెప్పినట్లు గుర్తు.

అంతా తానే అయితే మరి తనకు తానే పూజ చేసుకోవటం ఏమిటి? అన్న ఆలోచన రాగానే వెంటనే యీ విషయం గుర్తుకు వచ్చింది. విశ్వమంతా తన రూపమని యీ విషయం గుర్తుకు వచ్చింది. విశ్వమంతా తన రూపమని అర్జునునికి విశ్వరూప సందర్శనం ద్వారా తెలియచేసి భగవంతుడు, పరిమితమైన కృష్ణుని రూపంలో అర్జునునితో సంభాషించలేదా ? అంతేకాదు.

**"వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః"** -అంటే "యాదవుల్లో వాసుదేవుడను నేను, పాండవుల్లో అర్జునుడను నేను" అని భగవద్గీతలో కృష్ణుడు అర్జునునితో చెబుతాడు !

అందుకే అమ్మ ఎప్పుడైనా తన పాదాలకు తానే పూజ చేసుకుంటుంటే నేను చూస్తే -

**"అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాఽహ మహ మౌషధమ్।**

**మన్త్రోఽహ మహమేవాఽఽజ్య మహమగ్ని రహం హుతమ్" ॥**

-రాజయోగాధ్యాయంలో కృష్ణుడు చెప్పిన మాటలను అమ్మచేతలతో వ్యాఖ్యానిస్తోందా అనిపిస్తుంది. పూర్ణుడైన జ్ఞాని లక్షణాలేమిటి ? అని ఎవరో అడిగితే **జ్ఞానికి తాను జ్ఞానియని, ముక్తుడని, యితరులు అజ్ఞానులని, బద్ధులని భేదం గోచరించదట. అంతా జ్ఞానస్వరూపులుగానే కనబడతారట.** అమ్మ దగ్గరకు వచ్చిన వాళ్ళెవరో "అమ్మా! అజ్ఞానంలో పడి కొట్టుకుంటున్నాం...." అంటూ ఏదో

చెప్పబోతూంటే **"నా కల్లా తోచదు; మీరంతా జ్ఞానస్వరూపులే ననిపిస్తుంది"** అన్నారు. అట్లానే ఎవరో "అమ్మా ! మీ ధ్యేయమూర్తులెవరమ్మా" ? అని అడిగితే **"మీరే నా ధ్యేయ మూర్తులు నాన్నా"** అన్నారు. అందుకే మరోసారి **"నేను మీలో దైవత్వాన్ని చూస్తాను; మీరు నాలో మానవత్వాన్ని చూస్తారు"** అన్నారు అమ్మ.

## 3. అలంకరణ

**అమ్మ ఎలా వుంటారు** ? కాషాయవస్త్రాలు ధరిస్తారా ? జడలు ధరిస్తారా? **శిష్యులున్నారా ? ఆమె కేదైనా ఉపాసనా** ? ఆమె ఏదైనా బోధిస్తూంటారా ? మనతో **మామూలుగా మాట్లాడతారా** ? అమ్మ నెప్పుడూ స్వయంగా దర్శించుకోని వాళ్ళకు సామాన్యంగా కలిగే సందేహాలివే.

**అమ్మ** సన్న్యసించలేదు; ఆమె సంపూర్ణగృహిణి. "మీరు చేసే సాధన ఏమిటమ్మా?" అని ఎవరో అడిగితే "పిల్లల్ని కనడమే" అన్నారట ! ఆమె కాషాయ వస్త్రాలుగాని, జడలుగాని ధరించరు. సామాన్యగృహిణుల్లాగా జడవేసుకొని పువ్వులు పెట్టుకుంటారు. ఆమె సర్వాలంకార శోభితురాలు. ఆమెకు శిష్యులెవరూ లేరు; అంతా శిశువులే. "మీధ్యేయమూర్తులు ఎవరమ్మా ?' అని ఎవరో అడిగితే "మీరే నా ధ్యేయ మూర్తులు నాయనా" అన్నారట.

అమ్మ సాధనలేమీ చెయ్యరు. మౌనం వంటి వ్రతాలేమీ ఆచరించరు. సాధకులు, సన్యాసులు వేసుకునే వేషమేమీ వుండదు.

**కారణం అమ్మ** అప్పుడప్పుడు వాచా తెలియజేసే విషయాల్ని గుర్తుంచుకుంటే అర్థం అవుతుంది. ఎవరు కాషాయాలు ధరించినా వైరాగ్యం వచ్చికాదు. వైరాగ్యం అలవరుచుకోవటానికి ఉపయోగించే సాధనమే కాషాయవస్త్రం. అట్లాగే దండము, కమండలము, రుద్రాక్షలున్నూ, సన్యాసము సహజం కాక కృత్రిమంగా అలవరచుకునేందుకు ఉపకరణాలే యివన్నీ – సన్న్యాసము, వైరాగ్యము సహజమైన అమ్మకు యీ సాధనలతో పనేమిటి ? ఆమె సంసారంలో వున్నా అమ్మను సంసారం అంటజాలదు. అమ్మ అంటారు ? **"సంసారంలో తానుండవచ్చుకాని తనలో సంసారం వుండకూడద"ని** ఇటు అమ్మ దగ్గరకు, వెనుక భగవాన్ రమణమహర్షి దగ్గరకు అనేకులు కాషాయాలు ధరించిన సాధువులు వచ్చారు. వాళ్ళు కాషాయవస్త్రం ధరించాక పిల్లల్నో తల్లినో చూడాలని వుందని ఏడుస్తారు – ఇంతే బాహ్యాడంబాచారానికీ, లోపలి గుణానికీ

కల సంబంధం ! అమ్మ యీ సంఘటన చెప్పి సన్న్యాసం పుచ్చుకుంటామనే వాళ్ళతో అంటారు. సన్న్యాస్యం పుచ్చుకొనేది కాదనీ, దానికై ఆదిరావాలనీ, మామూలుగా సంసారంలో యింతకాలం వున్నా అమ్మ దేన్నీ కోరలేదు. దేనికీ బాధపడలేదు. పైగా "బాధపడటమే కాని పెట్టటం ఏముంటుంది ? ఏం చేసినా బాధపడని వాణ్ణి ఎవరు బాధ పెట్టగలరు ?" అనీ, "బాధ అనేది వుంటేగా సహనం తెలియటానికి ?" అని అమ్మ అంటుంది. ఇష్టా నిష్టాలు, కష్టసుఖాలు అన్న ద్వంద్వాలు లేకపోవటమేగా సన్న్యాసం అంటే. అదే అమ్మ రూపం అయినప్పుడు యింక ఆ స్థితినందుకునే సాధనాలతో పనిలేదు.

అమ్మ సర్వాలంకారభూషిత. అసలు అలంకరణ ఎందుకు ? అందంగా వుండేందుకని మన ఉద్దేశ్యం. కాని నిజానికి బాహ్యాలంకరణ లోపలి ఆధ్యాత్మిక స్థితి ననుసరించి వుండటానికి నిర్ణయింపబడినది శాస్త్రకర్తలచేత. అవి ఆధ్యాత్మికౌన్నత్యానికి చిహ్నాలు, సంకేతాలుగా వుద్దేశింపబడ్డాయి. విష్ణువు వంటి దేవుళ్ళు, లక్ష్మివంటి దేవతలు సకల కళ్యాణగుణ ప్రపూర్ణులు అని వర్ణించబడ్డారని మాత్రం ఎందరు గ్రహిస్తారు? ఇది తెలియని వాళ్ళు "మానవులు తయారు చేసిన మకర కుండలాలు, కిరీటం వంటివి సర్వ సృష్టికి ముందున్న సృష్టికర్త ఎట్లా ధరించాడు?" అని ప్రశ్నిస్తారు. అమ్మ అన్నారు **"కళంకం లేనిదే అలంకారం"** అని. అన్ని కళంకాలకూ కారణం అహంకారం. "నేను ఈ శరీరం మాత్రమే; నేను వేరు. సృష్టివేరు" అన్న భావం ఉద్భవించాకనే వాని మీద కామక్రోధాదులు ఏర్పడతై. కళంక రహితమంటే అహంకార రహితమని అర్థం. అంటే అంతా తానై వుండటం. ఆ చరమస్థితే అలంకారం. అందుకే అమ్మ కిరీటాన్నెవరో దొంగిలించారట అది విన్నామన్న వాళ్ళతో అమ్మ అన్నారు. **"నా కిరీటాన్ని ఎవరో దొంగిలించలేదు. అది ఒకరు పెడితే వచ్చింది కాదు. ఒకరు తీస్తే పోయేదికాదు"** అని. ఆమె అన్నీ అయి, అర్థం కానిదై ఆద్యంతములు లేనిదై ఆద్యంతములూ అయి, అడ్డులేనిదీ ఆధారమైనదీ అయిన అమ్మ అవటమే అలంకారం. ఆమెలోని సర్వత్వం కిరీటం, ఆమె సర్వకారిణి అవటమే గాజులు, వుంగరాలు. తన నడకే సృష్టిసడకై, సర్వాన్నీ తన పాదాలలో ధరించటమే బంగారు మట్టెలు, పట్టాలు. తానే మూడై, మూడు ముడివేసుకుని త్రిపుటి అయి త్రిపురసుందరి అవటమే ఆమె కేశాలంకరణ. శబ్దరూపిణీ అయి, సరస్వతియై. సర్వసృష్టినీ వాక్కుగా చేసుకోవటమే ఆమె కంఠాభరణాలు; సృష్టి స్థితిలయములు తన ఉచ్ఛ్వాస, నిశ్వాస సంధులుగా తన

శ్వాసల్లో సర్వకాలాన్ని, బంధించింది కనుకనే ఆకాశంలో వ్రేలాడే బ్రహ్మాండంలా ఉంది ఆమె బులాకీ. ఈ ఆభరణాలు ఆమెకు ఏ బిడ్డలు సమిర్పించుకోకమునుపే వున్నై. అమ్మ దగ్గర మొదట్లో వచ్చి చూచి వెళ్ళిన వాళ్ళు చెబుతారు. "ఆమె ఎంత నిరాడంబరంగా వుండేవారో" అని, రాజమ్మగారితో కూర్చున్న ఫోటోలో చూస్తేనే తెలుస్తుంది ఈ సంగతి. ఆమె గడ్డలుగడ్డలుగా వుండే నేలమీదైనా కొంగుపరచుకుని హాయిగా పడుకునేవారట. ఇది గుర్తుంచుకుంటే చదువుకున్నామని మిడిసిపడే వారికీ, మనసులో అమ్మ అలంకరణను చూచి విడ్డూరంగా అనుకునే వాళ్ళకు సరైన సమాధానం దొరుకుతుంది.

## 4. రూపం

అమ్మ రూపం చాలా ఆశ్చర్యకరంగా వుంటుంది. ఎంత వింతగా వుంటుందంటే ఆమెను చూచిన ప్రతివ్యక్తీ "ఆమెలో యిది అని మాటల్లో చెప్పటానికి వీల్లేని ప్రత్యేకత. ఆకర్షణ, దైవత్వం గోచరిస్తుంది" అంటూ మాటల కోసం వెతుక్కుంటాడు.

అమ్మ అంత పొడవైనవారు కారు. సామాన్యంగా దేవాలయాల్లో వుండే పెద్దదైన అమ్మ విగ్రహం ఎంత వుంటుందో అంతే వుంటారు. అవయవాల పొందిక, ముక్కు గడ్డం కన్నులు పాదాలు – అంతా విగ్రహంలా తీర్చినట్లుంటాయి. అది లౌకికమైన సౌందర్యం కాదు. అది కళ్ళను కాక హృదయాల నాకట్టుకునే దివ్య సౌందర్యం. స్ఫురద్రూపి అన్న పదానికి నిర్వచనం ఆమె రూపం. అసామాన్యమైన దేహకాంతి – రంగుకాదు. ఆమె దృష్టిలో కూడా ఎంతో చురుకుదనం, దయా, శాంతి అన్నీ మిళితమై వుంటాయి. కనుబొమ్మల మధ్య వుండే పెద్ద కుంకుమబొట్టు చూడగానే ఆమె ఎవరో తెలియకపోయినా "అమ్మ" అని హృదయానికి హత్తుకునే పదం స్ఫురిస్తుంది. ఆమె ననుకరించటానికి ఆ బొట్టునే మరెవరైనా పెట్టుకుంటే "శక్తి, కాళి," అన్నపదాలు స్ఫురిస్తాయి. ఆమె ముంజేతులు, అరిచేతులు, వేళ్ళు, పాదాలు అన్నీ ఆమెలోని దైవత్వాన్ని చాటుతాయి – సౌందర్యంలో, మృదుత్వంలోనూ, గొప్ప రామభక్తులు రంగన్న బాబుగారు ఆయనతో వచ్చిన వాళ్ళతో అన్నారు. "మీరు అమ్మ పాదాల్ని గమనించారూ ? అటువంటి పాదాలింకెక్కడా వుండవు. అవి సామాన్యములు గావు!" అని –

నవ్వుతూ తన బొజ్జను తానే నిమురుతూ అంటారు. "నేను ఎప్పుడు నిండు

**చూలాలినే; ఎప్పుడూ బాలింతనే. అటువక్క యిటుపక్క ఎంతమంది పాపాయిలున్నారో అటుపక్క అంతా ప్రేమకుమారులు; యిటువక్క అంతా వాత్సల్యలు"** అని. "బ్రహ్మాండభాండోదరీ" అని ఒకాయన అమ్మను స్తుతించారు.

అమ్మశరీరం ఎంతో మృదువుగా వుంటుంది. ఎంత నెమ్మదిగా తాకి నమస్కరిద్దామన్నా పాదాలు క్షణంలో కందుతాయి. చర్మం పసిపిల్లల చర్మంలా వుంటుంది. గట్టిగా వూదితే గుంటపడేటట్లుంటుంది.

ఆమె రూపంలో రెండు విశేషాలున్నాయి. ఒకటి – అమ్మరూపం ఆమె భావాన్ని అంత సజీవంగా సంపూర్ణంగా వ్యక్తంచేసి, ఆ భావమే వ్యక్తిరూపం ధరించిందా అన్నట్లుంటుంది. కోపం, బాధ, చికాకు, సంతోషం, గాంభీర్యం – ఏదైనాసరే. చిన్నపిల్లలా అల్లరిచేస్తూ, నవ్వుతూ, అలుగుతూ మారాం చేస్తూంటే ఎంతో సహజంగా పసిపిల్లలా వుంటారు. మౌనంగా గంభీరముద్ర దాల్చి దృష్టి దిగంతాలకు సారించి చూస్తూ కూర్చుంటే ఎప్పుడూ నిలవని కాలం మనస్సూకూడా నిల్చిపోతాయి. ఆ నిశ్శబ్దం కొంతమందికి గొంతు పిసికేస్తున్నట్లుంటుంది కూడాను. అసలు ఆమె ఎప్పుడైనా ప్రసన్నంగా వుంటారా అనిపిస్తుంది. అట్లాంటప్పుడు అక్కడ కూర్చున్నవాళ్ళకు కదలటం కూడా కష్టమవుతుంది. ఎప్పుడైనా ఆమె దృష్టితో మందలిస్తే మళ్ళీ ఆమెకై ఆమె మనల్ని ప్రసన్నంగా పలకరించి కూర్చో పెట్టుకుంటే తప్ప కొన్ని రోజులతరబడి ఆమె దగ్గరకు వెళ్ళటం కష్టం. ఆమె లాలనగా ఒక్కసారి పిలిచినా, ఆమె మన తల నిమిరినా ఎంతవృద్ధుడైనా ఆమె ముందు పసివాడై బుజ్జగించే తల్లిదగ్గర ఏడ్చినట్లు ఏడుస్తాడు.

ఆమె రూపంలో మరోవిశేషం: ఆమె ఒక క్షణం వున్నట్లు మరోక్షణం వుండరు. ఇది కేవలం మన మనస్సులో మార్పేనేమోనని పరీక్షించటానికి ఒకే సమయంలో అనేక ఫోటోలు తీస్తే ఏ రెండు ఫోటోల్లోనూ ఆమె ఒక లాగ ఉండరు. అమ్మదర్శనం చేసుకుని వెళ్ళేముందు ఫోటోలు తీసుకుందామనుకునే వాళ్ళకు కూడా ఆ ఫోటోలు ఎంచుకోటంలో యిదే చిక్కు. అనుకరణలో కూడా ఎవరి ననుకరిస్తారో వాళ్ళే ఆమెలో మనకు గోచరిస్తారు. అన్ని రూపాలు తనవేననా ? నామకరణం, అన్నప్రాశన చేయించుకునే పసిపిల్లల్ని కూడా యిట్టే ఆకర్షించి ఆకట్టుకుంటుంది. ఎంతసేపైనా కన్నార్పకుండా, దృష్టిత్రిప్పుకోలేని పరిస్థితిలో అలా వుండిపోయే పిల్లలెంతమందో ! ఇందులో కొంతమంది బాహ్యచైతన్యం కోల్పోయేవాళ్ళు, శ్వాస నిలిచిపోయేవాళ్ళు, అతిగాఢమైన నిద్రలోకి జారిపోయే వాళ్ళు ఎంతమందో !!

అంత మృదువుగా వుండే శరీరంలో అంత సహనము, అంత బలము ఎలా దాగి వుంటాయా అనిపిస్తుంది. ఎందుకంటే అమ్మకు పాలతో అభిషేకాలు చెయ్యాలనే తొందరలో పొయ్యిమీద కాగేపాలను తీసుకువచ్చి కుమ్మరించినా ఆమె చలించలేదు. సలసలా కాగే పులుసులో అనుభవజ్ఞుడైన వంటవాడు కూడా పొడుగాటి గరిటెతో కదిలిస్తూంటే ఆమె తనచేతిని అందులో ముంచి సెగలు కక్కే ముక్క అందుకుని తినటం నేను చూచాను. ఆమె వేగంగా నడిస్తే మనం పరుగెత్తవలసిందే. మనం సోలి పోవలసిందే కాని ఆమె అగను కూడా ఆగరు. అన్ని ఆకులతో పాటు దురదగొండి ఆకులతోనూ, బెండ ఆకుల తోను పిల్లలు అమ్మకు పూజచేసుకోవటం చూచాను. ఇదివరకు వచ్చిన ఒక సాధువు అమ్మ సహనాన్ని పరీక్షించటానికి గజం దూరాన కూర్చుని గుండ్రాళ్ళతో పూజ చేశాడని విన్నాను. అంత మార్దవం, అంతదార్ఢ్యం కలిసి ఆమెలో ఎలా దాగివున్నాయా నన్నదే వింత, విశేషమూను.

ఛాయాచిత్రాల్లో ఎంతో కురూపిగా కనిపించే సాయినాథుని గురించి ఆయన భక్తుడన్న మాట గుర్తొస్తుంది. – “ఆయన సౌందర్యాన్ని శరీర మార్దవాన్ని చూడటానికే షిర్డీలో ఎంతకాలమైన వేచివుండచ్చు” అని. భగవాన్ రమణమహర్షి గురించి కూడా ఆయన దగ్గర వున్నవాళ్ళు అలానే వ్రాస్తారు. బహుశః ఆ సౌందర్యానికి కారణం “సత్యం, శివం, సుందరం” – యీమూడు వాళ్ళే అయివుండటమేనేమో!

## 5. సంసారం

అమ్మను గురించి వినేవాళ్ళనేకమంది నాశ్చర్యపరిచే విశేషం ఆమె సంసారం. ఆమెను సన్నిహితంగా గమనించిన వారి కర్థమవుతుంది విశ్వకుటుంబమే ఆమె కుటుంబమని, కాని వూరికే ఆమెను గురించి విన్నవారికి “అంత జ్ఞానం. దైవత్వం కల ఆమెకు సంసారంతో ఏమి పని” ? అన్న ప్రశ్న వస్తుంది. అందుకే అమ్మ అన్నారు “విన్నవాడు విమర్శిస్తాడు, కన్నవాడు వివరిస్తాడు” అని.

అమ్మను ఎరిగిన వాళ్ళెవ్వరో అమ్మకు వివాహం జరుగబోతోందని తెలిసి “ఎందుకమ్మా నీకివన్నీ ?” అని అడిగితే అమ్మ **“పెళ్ళిలో పెద్దపులి ఉన్నదని భయపడేవారి భయం పోగొట్టటానికే”** అని అంది. అంతేకాదు **“ప్రేమకంటే ధర్మం గొప్ప”** దన్నారు అమ్మ. తదనుగుణంగా అమ్మ తన ధర్మాన్ని ఎంత సంపూర్ణంగా ఆచరిస్తారో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఆమె కే ధర్మాలు అవసరం లేకపోయినా, •

మహాభారతంలో కృష్ణుడు రాయబారానికి వెళ్ళేముందు బ్రాహ్మీ ముహూర్తంలో లేచి, ఆర్ఘ్య, హోమ జపాలు చేసినట్లు వ్యాసుడు వర్ణించడం గుర్తొస్తుంది. అమ్మ అనుదినం నిద్రలేచిన మరుక్షణం బొట్టుదిద్దుకోవడం, ముఖ ప్రక్షాళన మైన మరుక్షణం పుస్తెలకు కుంకుమపూజలు జరిపి, వాటిమీదగా తీర్థం మూడుసార్లు కళ్ళకద్దుకొని తీసుకోవటం, పూజలకు వచ్చి కూర్చోబోయే ముందు శ్రీ నాన్నగారి పాదాలకు నమస్కరించి రావటం, ఏ పనైనా నాన్నగారి అనుమతి లేకుండా చెయ్యకపోవటం - యివన్నీ చూస్తుంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది. స్త్రీకి పాతివ్రత్యం, పురుషుడికి ఏకపత్నీవ్రతం సంసారంలో పరమార్థ ప్రాప్తి హేతువులని సూచించడానికి ఆమె అలా చేస్తారని పిస్తుంది. ఆమె మాటలుకూడా ఆ భావాన్నే స్ఫురింప చేస్తాయి.

అమ్మకు సంసారం ఎందుకన్న దానికి మొదట అమ్మ ఒక సమాధానం యిచ్చారు. అందరికీ ఆదర్శప్రాయంగా ధర్మాన్ననుసరించి చూపటమేనని రెండవ సమాధానం. ఇంక మూడవది -

"అమ్మా ! మేము సంసారంలో పడికొట్టుకుంటున్నాము - యిందులో నుంచి బయటపడే మార్గం-" అన్నారొకరు.

"సంసారం అంటే" ? అమ్మ ప్రశ్నించారు.

"అదే భార్య, పిల్లలు - దారేషణ, పుత్రేషణ, ధనేషణ అంటారే అదే "

"నేనట్లా అనుకోను. **సంకల్పమే సంసారమంటాను"** అన్నారు. ఆ పండితుడు నిరుత్తరుడయ్యాడు దీర్ఘాలోచనలో.

అమ్మ అన్న యీ వాక్యంలో రెండర్థాలు స్ఫురిస్తాయి. అన్ని సంకల్పాలకూ కారణమైన మనస్సు, మనస్సు యొక్క అస్థిరత్వం దానివల్ల కలిగే రాగద్వేషాది ద్వంద్వాలు - యివే బాహ్యంగా సంసారం ఏర్పడటానిక్కారణం అని ఒక అర్థం. సంసారం నుండి విముక్తుడవటం అంటే యీ సంకల్పాలు లేకుండా అంతా తానైన ఏకస్థితిలో వుండటమే.

ఇంతకంటే లోతైన అర్థం మరొకటి ఉంది. సంసారం అంటే మామూలుగా చెప్పుకునే అర్థం జన్మలకు కారణమైనదేనని. అమ్మ అన్నారు **"జన్మకు కారణం అకారణం"** అని. అంటే భగవత్సంకల్పమే సర్వసృష్టికీ, కాలానికీ, అందులో భాగాలమైన

మనకూ, మనలో కలిగే సంకల్పాలకు కారణం అని. అంటే భగవత్సంకల్పమే సంసారం అయింది. సంసారాన్నుండి విముక్తి కూడా అప్పుడు భగవత్సంకల్పంవల్లే కావాలని స్ఫురణ – అంతేకాదు. సంసారమంటే జన్మము, భార్య, పిల్లలు అని కాదు. అది మనదనుకోవటమే. అంతా వాడిదే (భగవంతుడిదేనని) అనుకోవటం తరుణోపాయమని కూడా అంటారు.

**"సంసారంలో తానుండవచ్చుగాని తనలో సంసారం వుండకూడ"**దన్న అమ్మ వాక్యం అందరికీ పరిచితమే. ఇది భగవానుడి లక్షణం. సృష్టి చేసి, అందుకు తాను బద్ధుడై తాను వ్రాసిన నాటకంలో తానొక పాత్ర వహించి నాటక ధర్మానికి తలవంచి నట్లుండటమే సంసారం. అయినా అందులో సుఖదుఃఖాలకు లొంగకుండా అను భవిస్తున్నట్లు అభినయిస్తూ పూర్తి చేస్తాడు. అది తెలియని వాడు జీవితరంగంలో తన పాత్ర నిర్వహించటంలో ద్వంద్వాల్లో చిక్కుకుంటాడు. ఇదీ తనలో సంసారం వుందనటానికీ తాను సంసారంలో ఉండటానికీ తేడా.

రమణ మహర్షి చెప్పిన ఒక కథ యిక్కడ చాలా సందర్భసహితంగా వుంటుంది. కడువేలి సిద్ధార్ అన్న ఒక మహాత్ముడు చెట్లనుండి రాలిన ఎండుటాకులు మాత్రం తిని జీవిస్తుండేవాడు. రాజు ఆతని గొప్పదనాన్ని ఎవరైనా పరీక్షించాలంటే, ఒకదాసి అందుకు కంకణం కట్టుకొందట. ఆమె అతనికి సమీపింలో కుటీరం వేసుకొని అతడు ఏరుకునే ఆకుల్లో వేయించిన అప్పడం ముక్కలు వేసేదట. ఆయన ఆకులు విడిచి అవి తినడం మొదలు పెట్టాక, రుచికరమైన పంటకాలలవాటుల చేసి, చివరికి శుశ్రూష చెయ్యటంలో ఆయన్ని 'సంసారంలో' దింపి ఆయనవల్ల కొడుకును కన్నదట. చివరికి అతని స్తితి బయట పెట్టటానికి తన నాట్యప్రదర్శనం అని చాటించింది. జనం, రాజు అందరూ మూగారు. ఆమె నాట్యం చేస్తుండగా పిల్లవాడు పాలకోసం ఏడుస్తే కడువేలి సిద్ధుడు అతన్ని ఎత్తుకుని అక్కడికొచ్చాడట. అది చూచి తనకాలి గజ్జను కావాలని తెంచుకొని, సిద్ధుడి దగ్గరికొచ్చి కట్టమంటే అతడు కడుతూండగా జనం చూసి అతన్ని పరిహసించారట. అప్పు డా సిద్ధుడన్నాడట – "ఇంతకాలం అహర్నిశలు నేను ఆత్మనిష్ఠయందున్న మాట నిజమే అయితే యీ రాతి విగ్రహం పగిలి అంతర్ధానం కావాలి"అని. వెంటనే అక్కడున్న విగ్రహం అల్లాగే అయితే రాజు, ప్రజలు, ఆ దాసి అందరూ నివ్వెరపోయారట. ఈ కథ ద్వారా భగవాన్ జ్ఞాని యొక్క స్థితిని బాహ్యచర్యల నుండి ఎవడూ నిర్ణయించలేడని విశదపరిచారు. అల్లానే నిత్య

బ్రహ్మచారి స్పృశిస్తే పరీక్షిత్తు జీవిస్తాడన్నప్పుడు శుకుడు కూడా ముందుకు రానప్పుడు కృష్ణుడు స్పృశిస్తే పరీక్షిత్తు జీవించడం కూడా యిదే విషయాన్ని నిరూపిస్తుంది. అమ్మకున్నట్లు కన్పించే సంసారం (నాన్నగారు, ముగ్గురు బిడ్డలు) ఆమెలోని దైవత్వాన్ని మాత్రం సంకుచితం చెయ్యకల్గుతుందా ? నిజంగా ఆమె సంసారం సర్వసృష్టిని యిముడ్చుకున్నది. ఆ సంసారం సృష్టికర్తను ఎంత బంధించకలదో ఆమెనూ అంతే. ఎందుకంటే అమ్మ అంటే ఆమె యిచ్చిన నిర్వచనం బ్రహ్మ విష్ణు మహేశ్వరుల నందర్ని యిముడ్చుకొంటుంది.

## 6. "నాకు మరుపే లేదు" - అమ్మ

అమ్మ దర్శనార్థం ఎంతో మంది వచ్చి వెడుతూంటారు - ప్రప్రధంగా వచ్చేవాళ్ళు, అరుదుగా వచ్చేవాళ్ళు, అప్పుడప్పుడొచ్చేవాళ్ళు వుంటారు వాళ్లలో. కాని అమ్మలోని ఒక విశేషాన్ని వ్యక్తపరిచేందుకు అవకాశం కల్పించేవారు అరుదుగా వచ్చేవారే. అమ్మను యింకా ఎవరూ గుర్తించని రోజుల్లో ఏ పాతిక సంవత్సరాల నాడో అమ్మ వాళ్ళను ఎక్కడో చూచి వుండవచ్చు. అయినా వాళ్ల పేర్లు, వివరాలతో సహా అన్నీ ఆమెకి గుర్తే, "నువ్వు యిన్నవ సంవత్సరంలో ఫలాని నెలలో ఫలాని వారం యిన్ని గంటలకు ఫలాని వాళ్ళతో కలసి వచ్చావు కదా?" అని మొదలు బెట్టి అప్పుడు వాళ్ళు ధరించిన గుడ్డలు, వాళ్ళ ప్రవర్తన, మాటలు, భావాలు, అన్నీ గుర్తుచేసి చివరికి ఆ రోజు తాను వాళ్ళకి అన్నంలోకి ఏ పదార్థాలు తయారుచేసినదీ కూడా చెబుతారు. అమ్మ దగ్గరకి తరచు వచ్చేవాళ్లలో కూడా చాలామంది వాళ్ళు మొదటిసారి అమ్మను దర్శించిన తేది, అప్పుడు వాళ్ళు వేసిన ప్రశ్నలు అవీ గుర్తుపెట్టుకోలేరు. అంతేకాదు ఫలాని సంవత్సరం ఫలాని పండక్కి నువ్వున్నావా ? - అని అమ్మ మాటల సందర్భంలో అడిగితే చాలా మంది సమాధానానికి తడుముకుంటారు. అప్పుడు ఆమె గుర్తు చెబుతారు. అమ్మ దర్శనార్థం వచ్చేవారు ఏవో కొన్ని ప్రత్యేక సందర్భాలలో వాళ్ళు జిల్లెళ్ళమూడి వెళ్ళడం మాత్రం గుర్తుంచు కోగలరు. సామాన్యమైన సందర్భాలను చాలా వరకు మరచిపోతారు. అమ్మకి అలాకాదు; అన్నీ గుర్తే; అన్నీ ప్రత్యేకమే; అన్నీ సామాన్యమే; అన్నీ సమానమే; అన్నీ విశేషమే!!

ఉదాహరణకి, అమ్మదగ్గర ఎప్పుడూ అంటిపెట్టుకుని వుండే రామకృష్ణ అన్నయ్యను గురించి ఒకసారి చెప్పారు. అమ్మ ఎవరి వివాహానికో వెడితే అక్కడ పసివాడుగా రామకృష్ణ నుంచొని వుంటే అమ్మ ఎత్తుకున్నారు. అందరి దృష్టిలో

"అనసూయ పిల్లవాడ్ని అప్పుడు ఎత్తుకుంది" అమ్మ దృష్టిలో యీనాటి రామకృష్ణుని కూడా ఎప్పటికీ ఎత్తుకున్నట్లే. అట్లాగే ఒకసారి బామ్మగారితో (అంటే అమ్మ అత్తగారు) మాట్లాడుతూ అమ్మ తన జననమప్పుడు ఆ గదిలో ఎవరెవరున్నదీ, ఎవరేమన్నదీ చెబుతూ ప్రథమంగా బామ్మ తనకు పాలుకుడిపిన సంగతి గుర్తుచేస్తే బామ్మ కళ్ళనీళ్ళపర్యంతం అయి "ఎవరు చెప్పారు నీకు యివన్నీ?" అని అడిగారు. అమ్మ నవ్వి ఊరుకున్నారు. నేను జిల్లెళ్ళమూడి వెళ్ళటం ప్రారంభించిన మూడున్నర సంవత్సరాల తరువాత కూడా నేను మొదట ఆమెను దర్శించిన తేది, ఆ రోజు అక్కడ యింకెవరున్నది, నేనేమి ప్రశ్నలు వేసినది, ఆమె ఏ సమాధానాలు యిచ్చినదీ అన్నీ గుర్తుచేశారు. అమ్మను రాజమ్మగారి దగ్గరకు తీసుకెళ్ళిన అనసూయమ్మగారు యీ మధ్య ఒకసారి వస్తే వెనుకటి సంగతులు తిరగవేశారు యిద్దరూ. బాగా జ్ఞాపకం వున్నాయని అనసూయమ్మగారు అనుకున్న సందర్భాల్లో కూడా అమ్మ చాలా సవరణలు చేస్తూ, ఆమెకు జ్ఞాపకం చేస్తూ అంతా తిరిగి చెప్పారు. ఎంతకాలం క్రిందటైనా సరే అమ్మతో మనం మాట్లాడిన మాటలు, వాటికి ఆమె యిచ్చిన సమాధానాలు అమ్మ 'తు' 'చ' తప్పకుండా తిరిగి చెబుతారు.

చాలాదూరం నుంచి అమ్మ దర్శనం చేసుకోటానికి వచ్చినవాళ్ళు జాలిగా "అమ్మా, మీ దర్శనం మళ్ళీ ఎప్పటికో; మీకు మేము గుర్తుంటామా ?" అని అడిగితే **"అసలు మరుపుంటేగా జ్ఞాపకం వుండటానికి?"** అంటారు అమ్మ. "అమ్మా ! మీ దగ్గరికి ఎంతో మంది రోజూ దర్శనార్థం వచ్చి వాళ్ళ వాళ్ళ సమస్యలు, కష్టాలు చెప్పుకుంటారు గదా ! యింతమందిలో మేము మీ కెలా గుర్తుంటామమ్మా ?" అని అడిగితే **"గొఱ్ఱెల కాపరికి తన మందలో ప్రతి గొఱ్ఱె దాని ఖరీదు దగ్గర్నుండీ గుర్తుండేటప్పుడు తల్లికి తనబిడ్డలు గుర్తుండటంలో ఆశ్చర్యమేముంది ?"** అంటారు. ఇలాగే యింకెవరితోనో మాట్లాడినప్పుడు **"నాకు మరుపేలేదు"** అన్నారు. ఆమె కన్నీ ఎలా గుర్తుంటాయని మనం అడిగితే "తెలియదు" అంటారు. ఒకటి రెండు సార్లు మాత్రం చెప్పారు. **"నా కవన్నీ ఎప్పుడో జరిగిపోయినట్లుండవునాన్నా ! ఇప్పుడు నా కళ్ళ కెదురుగా జరుగుతున్నట్లుంటాయి"** అని.

**"నాకు మరుపేలేదు"** అన్నారు. **"మరుపే మరణం"** అన్నారు. **"నేను అమ్మను నాయనా!"** అన్నారు. **"అమ్మ అంటే అది, అంతము లేనిది, అది అంతము అయినది"** అన్నారు అమ్మ. దీన్నిబట్టి శారీరక జననమరణాలు అమ్మ జ్ఞాపకానికి హద్దులు కావని

తెలిపోతున్నది. ఈ సందర్భంలో భగవద్గీతలో యోగీశ్వరుడు తనకు, అర్జునుడికీ అనేక జన్మలు గడిచాయనీ, అవి తనకు జ్ఞాపకం వున్నాయని ఒక చోట, తను నిత్యుడననీ, శాశ్వతుడననీ, జనన మరణాలకతీతుడననీ, మరొకచోట, చెప్పటం గుర్తుకు వస్తుంది. అందుకే దైవాన్ని మాతృదేవిగా చెప్పినప్పుడు శాస్త్రకారులు ఆమెను "కాళీ" అన్నారు. అంటే కాలమే తానైనది, సర్వనామరూపాలకీ తానే సృష్టిస్థితి లయాలు కల్పిస్తుందని వర్ణించారు. ఆమెనే "మహాకాళీ" అని చెప్పటంలో మూడుగావుండే కాలాని కాధారమైన ఏకకాలం తానే నన్న భావం స్ఫురిస్తుంది. అమ్మకూడా అన్నారు కాలమే భగవంతుడని, పరిస్థితులకు మించిన గురువు లేదని, గురువంటే అసలు భగవంతుడేనని. తాను అమ్మననీ, అమ్మ అంటే "అంతులేనిదీ, అడ్డులేనిదీ, అంతా అయినదీ - ఆధారం" అని చెబుతారు. దీన్ని బట్టి అమ్మ కాలస్వరూపం అని స్ఫురించక తప్పదు. రాజమ్మగారితో సంభాషణలోనూ, కళ్యాణానందభారతితో జరిగిన సంభాషణలోనూ అమ్మ వారిద్దరికీ ఏ విషయాన్ని వివరించ సంకల్పిస్తే దాని కనువైన పరిస్థితులు వాటికై అవి ఏర్పడ్డట్టు రావటం మనం చదివాము. అమ్మ మనం గమనించకుండా ఎంత పదిలంగా దాపరికం చేద్దామన్నా భూత భవిష్యద్వర్తమానాలలో జరిగే వాటిని గురించి సూచనలు ఆమె నోటివెంట వెలువడుతూనే వచ్చాయి. అమ్మ బాల్యంలో బాపట్లలో సత్రం ముందు నుంచోనుండి వేదపాఠశాలనుంచి విద్యార్థుల కంఠాలు, పక్కనే వున్న దత్తమందిరం నుంచి గంటలు వింటూ ఎదురుగా వున్న సత్రం అరుగు మీద తను పెట్టిన అన్నం తింటున్న బిచ్చగాళ్ళను చూస్తూ - ఆలయంలేని వూళ్లో ఆలయం నిర్మించాలని, సంస్కృత పాఠశాల స్థాపించాలని, భోజనశాల స్థాపించాలని అనుకున్న మాటలు యీనాడు మనకు జిల్లెళ్ళమూడిలో ప్రత్యక్షసత్యాలై కనిపిస్తున్నాయి. రాజమ్మ గారు వడ్డించిన 33 అధరువులలో సంకేతంగా సూచించబడిన 33వ సంవత్సరం అమ్మకు వచ్చినప్పుడే అమ్మ అందరికీ తెలియటం. "నువ్వు లేనప్పుడు నేనే అమ్మనవుతాను" అని అమ్మ రంగమ్మ తల్లితో చెప్పిన మాటలు యీనాడు యదార్థాలు కావటమూ జరక్కపోతే మీరంతా యీనాడు యీ వ్యాసం చదివేవారు కాదు !

అమ్మే కాలస్వరూపిణి అని చెప్పటానికి పైన చెప్పిన నిదర్శనాలు చాలు. ఆమెకు మరుపు (అంటే మరణం కూడాను) లేదనటానికింకొక నిదర్శనం వున్నది. ఒక ముక్కోటినాడు సోదరులు శ్రీ గోవిందరాజుల దత్తాత్రేయశర్మగారు అమ్మ జననానికి ముందు వర్ధన చెయ్యటం చూచి అమ్మ ఆయనతో అన్నారట - "1918 లో నృసింహ

జయంతి సందర్భంలో మంగళగిరి బాలాంబగారి సత్రంలో నువ్వు అన్నపుపళ్లెం తీసుకొని వడ్డిస్తూండగా నేను చూచాను" అని. కాని ఆ అన్నయ్య తీరికగా యీ మాటలను గురించి ఆలోచిస్తుండగా తోచిందిట – అమ్మ జననం 1923 లో గదా అని. ఇట్లాగే యింకొక సోదరుల విషయంలో 1911 లో ఆయనకు జరిగిన సంఘటనను వర్ణించి చెప్పారుట.

మూడు కాలాలు అమ్మకి ఏకకాలమే అయినప్పుడు భవిష్యత్తుకూడా వర్తమానమే. దీనికి నిదర్శనంగా మన తెలుగుదేశమంతటా క్రిందటి వేసవిలో జరిగిన అగ్ని ప్రమాదాలని, ప్రముఖులైన నెహ్రూ, కెన్నెడీలవంటి వారి మరణాలనీ అమ్మ కొన్ని గంటల ముందు సూచించారు. చీరాల నుంచి జట్టుగా మొదట్లో వచ్చే అన్నయ్యలతో అమ్మ చెప్పారట. కొద్ది నెలల తర్వాత వాళ్ళు యిక తరచుగా వద్దామనుకున్నా రాలేరని. అది అక్షరాల అలానే జరుగుతోంది. ఇట్లా ఎన్నో ! తన దగ్గర కొచ్చిన అనేకమంది జ్యోతిష్కుల గురించి మాట్లాడుతూ అమ్మ అన్నారు – ఒకసారి – "వీళ్ళలో ప్రతివాడికి తను చెప్పినదాంట్లో కొన్ని జరగటం, కొన్ని జరగక్కపోవటం వుంటాయిగా – గణితంలో లోపంగాని, అంచనాలో లోపంగాని, లోపం లోపమేగా! అట్లా కాకుండా అన్నీ తెలుస్తయ్యా ? ... అన్నీ ఎవరికి తెలుస్తాయి? కాలమే తానైనవాళ్ళకి కదా ! కాలమే తాననైప్పుడు మూడు కాలాల్లేవు. వాడికి 'భవిష్యత్తు" అనేదేముంటుంది ? దాన్ని చెప్పటమనే దేముంటుంది ?" అని.

కాలమంటే దైవమని, కాలమన్నా దైవమన్నా ప్రేరణేననీ, అదే సంకల్పమని, సంకల్పమే భగవంతుడని, వికల్పాలు కూడా సంకల్పంలోనివేననీ, దేవులాడినా, దొరకనివాడే దైవమనీ, అంతా అయినదీ, అర్థంకానిదీ 'అమ్మ' అని చెప్పటంలో "ధియో యోనః ప్రచోదయాత్" అని గాయత్రీ మంత్రంలో చెప్పబడేది, "కాలోస్మి" అని భగవద్గీతలో చెప్పినదీ అమ్మేనని మనకి తోచక మానదు. ఇదే వింత; ఇదే విశేషం. ఈ వింతలూ విశేషాలు ఎంత చెప్పిన యింకా సశేషాలే.

## 7. అందరిల్లు

జీవితంలో వింత, విశేషం అనిపించిన క్షణాలన్నీ చిరస్థాయిగా మన స్మృతిపథంలో వుంటాయి. జీవితంలో జ్ఞాపకం వున్న సంఘటనలన్నీ కొంచమో గొప్పో సామాన్యం కన్నా భిన్నంగా వున్నవేనని చెప్పాలి. బాగా విశేషంగా గోచరించే అనుభవాలన్నీ అంతకు ముందు ఎంత మంది జీవితాలలోనో జరిగినా ఎవరికి వారికి ప్రత్యేకం అనిపిస్తాయి. అందుకే అత్యుత్తమ ఆధ్యాత్మికానుభూతి ప్రతిసాధకుడి

జీవితంలోనూ "నభూతో న భవిష్యతి" అన్నట్లు వుంటుంది. ఎందరో మహాత్ములున్నా ఏ మహాత్ముని సన్నిధిలో వున్నవారికి ఆ మహాత్ముడే భగవత్స్వరూపుడుగా గోచరించటానికి కూడా కారణం యిదే. రమణమహర్షిని "భగవాన్" అన్నారు. రామకృష్ణ పరమహంసను "అవతారమూర్తి" అన్నారు. వారిని సామాన్యులు గుర్తించక పోయినా వారెటూ భగవత్స్వరూపులే. కాని వారి సన్నిధిలోని అఖండశాంతి, ఆనందం అనుభవంలోకి వచ్చినప్పుడు వారిని దైవమని భక్తుల హృదయాలు వాటికై అవే కీర్తిస్తాయి. ఈ అనుభూతి సామాన్యంగా మానవజీవితాలలో లభించే వింతలనూ, విశేషాలనూ మించినదిగా వుంటుంది. కనుకనే సామాన్య మానవ జీవితాలను నూతన పంథాలోకి మళ్ళిస్తుంది. ఈ విశేషానుభూతుల కూడలులే ఆశ్రమాలూ, ఆవరణలూ, కాని ఏ ఆశ్రయానికి వుండే ప్రత్యేకత దానికి వున్నది. ఏ దైవకార్యం కోసం ఏ సాంఘిక పరిస్థితుల మధ్య ఏ మహాత్ము దవతరిస్తాడో – అందుకు తగినట్లుగానే వుంటాయి ఆ ఆవరణలూ, ఆశ్రమాలూ.

అట్లాగే జిల్లెళ్ళమూడిలో అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో నిశ్చలదృక్కులలో ఉద్భవించిన ఆవరణం కూడా చాలా ప్రత్యేకత కలది. అంతా అయినదీ, అర్థం కానిదీ, ఆద్యంతాలు లేనిదీ, ఆద్యంతాలు తానే అయినది అమ్మ. అంటే అటువంటి అమ్మ పరిమితిగా కనిపించే రూపాన్ని పరిమితమయిన మనకు గోచరింపజేయటమే మొదటి లీల. ఆమెను మనం దర్శించటం విశేషం. దాని ఫలితంగా మనలో మనకు తెలియకుండా వచ్చే పురోభివృద్ధిని గమనించ గలిగితే వింతగ తోస్తుంది. ఈ మూడింటి కూడలి జిల్లెళ్ళమూడిలోని అందరిల్లు. అమ్మను దర్శించటానికి వెళ్ళేవారికి అత్యంతాశ్చర్యకరమూ, ఆనందదాయకమూ అయినది ఆవరణం. అదే అందరిల్లు.

అమ్మను దర్శించటానికి అనేక గ్రామాల నుండి వచ్చేవారి కోసం ఏర్పాటయిన భోజనశాలతో పాటు అనేక కుటీరాలు ఏర్పరచుకుని అక్కడే అమ్మ సన్నిధిలో నిలవవున్న వారితో యీ అందరిల్లూ ఉద్భవించి క్రమంగా వృద్ధి పొందింది. ఈనాడు అమ్మను దర్శించేవారికి ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ యిచ్చే విశేషమేమంటే మనం మామూలుగా వ్యవహరించే ప్రపంచాన్నుంచి అనేక అంశాల్లో భిన్నంగావుండే యీ విశ్వకుటుంబం. సోదరులూ, సోదరీమణులతో ఎప్పుడూ కలకల్లాడుతూ వుంటుంది. ఆవరణం. తెల్లవారుజామున 4 గంటలకు సుప్రభాతసేవతో రోజు ఆరంభమవుతుంది. ఈ సుప్రభాత సేవలో పాల్గొనే వారిలో చాలామంది పిల్లలూ పెద్దలూ అందరూ

అతిశ్రావ్యంగా భక్త్యావేశంతో, ఏకకంఠంతో పాడుతారు. తర్వాత ఆవరణంలో స్థిరనివాస మేర్పరచుకున్నవారు పిన్నలూ, పెద్దలూ - వారి వారి పనుల కెడతారు. ఈ పనులు సంవత్సరం పొడుగునా జరుగుతాయి. కొత్తగా వచ్చే సోదరుల వసతి కోసం ఏర్పడుతున్న కట్టడాలలో రాళ్ళు మోయటం, గానుగ వెయ్యటం దగ్గర్నుంచీ వ్యవసాయ పనులూ, మంచినీళ్ళు సరఫరా చేయటం, విరామ సమయంలో రాట్నాలు వడకటం, కొత్త పాటలు నేర్చుకోవటం, సంస్కృతం చదువుకోవటం వుంటాయి. వాళ్ళ పనులు పొద్దున్నే అమ్మ దగ్గర సెలవు తీసుకొని పెందరాళే వెళ్లి పోయే వారికోసం ఉదయం 9 గంటలకే వంటలూ, వడ్డనలూ ప్రారంభమై అకాలంలో వచ్చినవారికి సైతం రోజల్లా రాత్రి 12 గంటలదాకా జరుగుతూంటాయి. ఈ పనులన్నీ మనలాంటి సంస్కారవంత మయిన కుటుంబాల నుంచి వచ్చినవాళ్లే - చదువు, ధనము, సంఘ(అ) మర్యాదల గురించి లెక్కచేయక సోదర ప్రేమనూ, మాతృభక్తినీ మాత్రమే ఆలంబనగా తీసుకుని చేస్తారు. అందులో సగం మంది చిన్నపిల్లలూ, అందులోనూ, ఆడపిల్లలు కావటం చాలా విశేషం. కేవలం తలలు నెరిసి నిస్పృహలతో నిండి జీవిత వాస్తవాల నుంచి పారిపోయిన పిరికివాళ్ళు కారీ సోదరీ సోదరులు. సాయంసంధ్యతో సామాన్యంగా పనులు ముగుస్తాయి. ఈ విశ్వకుటుంబంలో వ్యక్తులను బంధించే సోదర ప్రేమ, ఆదరణ, ఆ పవిత్ర భావాలతో కలుషితం కాని మనస్సులూ - కొత్తగా జిల్లెళ్ళమూడి ప్రథమంగా వచ్చే వారిని మరో ఆదర్శ ప్రపంచానికి పరిచయం చేస్తాయి.

అన్నిటికంటే కొట్టవచ్చే విషయం ఏమంటే - ఎవరూ ప్రత్యేకమయిన సాధనలంటూ ముక్కుమూసుకుని కూర్చోరు యీ ఆవరణలో. ఎవరైనా అమ్మ సన్నిధికి వచ్చిన కొత్తల్లో సాధనలను పట్టుకు పాకులాడినా కొంతకాలానికి వాటి అనావశక్యత వారికే గోచరిస్తుంది. పాతకాలం నాటి రంగుటద్దాలలోంచి చూచేవారికి అనిపించ వచ్చు. వీరందరూ అంతటి దివ్యమూర్తి సన్నిధిలో వుండే అదృష్టాన్ని సాధనతో సాఫల్యాన్ని పొందే యత్నం చేయక మామూలు కార్యకలాపాలలో కాలం వృధా చేసుకుంటు న్నారేమోనని, ఇటువంటి వాళ్లలో నేనొకడిని. నాకీ విషయం గురించి ఒకసారి అమ్మ చెప్పారు. ఏ కొండల్లోకో, అడవుల్లోకో పారిపోయి అక్కడ కళ్ళూ ముక్కూ మూసుకుని ఏకాగ్రత కోసం విఫల ప్రయత్నం చేయటం. సృష్టిలో సర్వజీవకోటిలోనూ ఏర్పడివున్న స్త్రీ పురుష భేద సంబంధం వలన తను తప్పించుకో జూచి సహజోద్రేకాలను అణచకోలేక తపోభంగం పొందేకంటే యీ ఆవరణలో

ఎప్పుడూ అమ్మను ప్రేమిస్తూ, అమ్మనామాన్ని ఉచ్చరిస్తూ సోదర ప్రేమలోనూ, సేవలోనూ సంపూర్ణ మానవత్వంలోని మాధుర్యాన్ని ఆస్వాదిస్తూ, నిత్య కార్యకలాపాల్లో ఎప్పుడూ వాళ్ళదేహాలను దగ్ధం చేసే వీరి తపస్సు చాలా సుగమం, సులభం, పతనానికి తావు లేనిది ... ఆ మార్గం అని. సరి అయిన దృక్పధంతో చూస్తే సర్వత్రా విజ్ఞానాన్ని పొందవచ్చు అన్నది అమ్మ విధానం. దానికి ప్రత్యక్ష తార్కాణం ఆవరణం. అమ్మ ప్రతి పాదించే నూతన విధానంలో చీపురు, చేట, కత్తిపీట - మొదలయిన సర్వమూ పరిపూర్ణత కోసం మానవుని హృదయంలో జరిగే అఖండ ప్రయత్నానికి సంకేతాలుగా కనిపిస్తాయి. అట్లా చూచేటట్లయితే జీవితమే సర్వసాధనల సారంగా పరిణమిస్తుంది. అమ్మ అన్నారు. మానవ జీవితమంటే సకల వేదాల సమ్మేళనమేననీ - భక్తి, జ్ఞానం, యోగం, కర్మ ... వీటిలో ఏదీ మరొక దాన్నించి భిన్నంకాదనీ - అన్నీ ఒకటేననీ...

అనవరతం వీరు చేసే కార్యకలాపాల్లో వారికి వ్యక్తిగతంగా ఏ ప్రతిఫలమూ వుండదు. అమ్మ దర్శనార్థం వచ్చేవారు వీరికి కృతజ్ఞతలు అర్పించటం కూడా అరుదు. వీరు కృతజ్ఞత కర్హులన్న స్మరణే వీరికుండదు. ఇది కర్మయోగం. అంతా అమ్మ సేవయేననీ, అంతా అమ్మదేననీ, అన్నీ అమ్మే చేస్తుందని ఏదీ వీరిదికాదనీ - ఎప్పుడూ వీరి హృదయాల్లో నిలిచే భావమే జ్ఞాన వైరాగ్యాలసారం. వీటి కాలంబనమయిన (అమ్మ యందు వీరి కుండే) భక్తి (ప్రేమ అంటే యింకా బాగుంటుందేమో) భక్తి యోగం. మనస్సు సర్వదా అమ్మయందు లగ్నం అయివుండడం యోగం. అక్కడ నిలవవున్న బిడ్డలచే యీ మార్గాలన్నీ ఒకేసారి వారికి తెలియకుండానే శోధింప జేస్తున్నారు అమ్మ. చేయించటం కాని చెప్పటం తన విధానం కాదన్న అమ్మ మాటల కొక గొప్ప వ్యాఖ్యానం ఈ ఆవరణం. ఆవరణంలో వారు పరిపూర్ణులనీ మానవాతీతులనీ కాదు. మానవులు కాబట్టి సాధన అవసరం అయింది. ఆ సాధన మాత్రం అతి ఉత్తమమయినది అతి సులభమయినది.

అంతేకాదు - సామాన్యంగా గర్వంవలన గాని, సందేహాల వలనగానీ సాధకుడు దారి తప్పటం మనం ఎక్కువగా గమనిస్తూంటాం. సరిగా తాను దారితప్పేటప్పుడు తన పతనాన్ని ఆరంభంలోనే తనకు సూచించే విధానం లేదు. అందుకనే పతనాన్ని అరికట్టడం కష్టం. కాని ఈ ఆవరణం యీ సమస్యను బాగా పరిష్కరించింది. తొలిసారి ఆవరణంలో అడుగుపెట్టినప్పుడల్లా అంతామంచి గోచరించటానికి కారణం. ప్రపంచంలోని వక్రగతులన్నింటినీ బెదిరి హృదయంలోని

చీకటి కోణాల్లో దాక్కున్న సహజమయిన మంచితనాన్ని అమ్మ పవిత్ర సన్నిధీ, ఆ సాన్నిధ్యం వలన చాలా వరకూ శుద్ధి అయిన హృదయాల ప్రభావం బహిర్గతం చేస్తుంది. తనలోని కొద్ది దైవత్వం తొంగి చూడటంవల్లనే ఆవరణం అంతటా దైవత్వం కనిపిస్తుంది. కాని ఎక్కువ కాలం అక్కడ నిలిచాక అంతఃకరణ శుద్ధం కావటాన మనలోని కల్మషం కూడా అంతకరణల కవగతం అవుతుంది. నిత్యజీవితంలో మామూలు ప్రపంచంలో సామాన్యంగా జరుగని పని యిది. చివరకు తనలోని లోట్లను విస్మరించి యితరులను విమర్శించే గుణం బహిర్గతం కావటాన అంతటా చెడు గోచరిస్తుంది. అమ్మ అంటారు. "ఈ ఆవరణలో ఉంటే కష్టాలు తొలుగుతాయి అనుకోకూడదు. బయట ప్రపంచంలో మీ కేవి ఉంటాయో అవన్నీ యిక్కడా ఉంటాయి" అని. దృష్టికి మంచి ఎంత అవసరమో చెడు కూడా అంతే అవసరమంటుంది. దృష్టిలో పనికిరానిదంటూ ఏదీ లేదంటుంది. సృష్టికి సంక్షిప్త ప్రతి ఆవరణం. కుటుంబానికి విస్తృత ప్రతి ఆవరణం. మానవుడికి ప్రతిబింబమే యీ రెండు. అట్లాగే ఆవరణమున్నూ, తనలోని పురోగతి తిరగోతులకూ, తనలోని శాంతివికారాలకూ ప్రతిబింబాలే ఆవరణంలోని వ్యక్తులు. అదేమీ చిత్రమోగానీ – మనలోని బలహీనతలన్నీ మనం ఆవరణంలో ఎదుర్కొనే సంఘటనల్లో వ్యక్తం అవుతుంటాయి. ఆవరణలోని కష్టనిష్ఠూరాలను తట్టుకోలేక పోవటం కేవలం తనను తాను జయించుకునే ప్రయత్నంలో ఓడిపోవటమే. అందుకనే ఆవరణంలో కొంతకాలం గడిపితే ఆ కాలంలో ఆవరణం గురించిన అభిప్రాయం ఊసరవెల్లి రంగులు మారినట్లు మారుతుంది. ఒక్కొక్కసారి సృష్టిలోని అసహనం, అశాంతి అంతా కరుడుగట్టుకొని ఆవరణంలో నిలిచాయా అనిపిస్తుంది. అదే క్షణంలో మరొకరికి భూలోకస్వర్గంగా కనపడుతుంది. అంతేకాదు – మనకే మరోక్షణంలో హాయిగానూ, ప్రశాంతంగానూ కనబడుతుంది. అందుకనే నాకు ఆవరణాన్ని స్కూలు అనటం కంటే ట్రయినింగ్ క్యాంప్ అనాలనిపిస్తుంది. అయితే యిందులో వచ్చే ట్రయినింగ్ ఐహికానికీ, ఆధ్యాత్మికానికీ కూడా దోహదంగా ఉంటుంది. నిజమైన ఆధ్యాత్మికంలో, ఐహికమూ యిమిడి ఉంటాయని అమ్మ ఒకసారి చెప్పిన మాట ఆవరణానికీ వర్తిస్తుంది. ఒక వ్యక్తి ఆవరణలో ఎటువంటి చిక్కుల నెదుర్కొంటాడో బయట ప్రపంచంలో అవే చిక్కులను ఎదుర్కోవలసి వస్తున్నట్లు తోస్తుంది. అయితే ప్రాపంచిక జీవనానికి ఆవరణంలోని జీవితానికి వున్న వ్యత్యాస మేమంటే ఆవరణంలో ఉన్నంతసేపు లోటుపాట్లు వారికి చీకటిలో నక్షత్రాల్లా స్పష్టంగా కనిపిస్తాయి. వాటిని సరిదిద్దుకోలేనివారు ఆవరణంలోంచి

వారికై వారే వెళ్ళిపోతారు - అమ్మ ఉంచితే తప్ప వారు వెళ్ళిపోవటంలో కనిపించే కారణానికీ వారి వ్యక్తిత్వంలోని ప్రధాన బలహీనతకూ దగ్గర సంబంధం వుంటుంది.

ఆవరణలో కొట్టవచ్చేటట్లు కనిపించేదీ ఆవరణ నిర్వహణలోని లోటుపాట్లు, ఇనుప సంకెళ్ళలా అందులో నివసించేవారిని కట్టివేసే నిర్బంధాలేమీ లేవు. ఏ పనీ చేయకుండా వృధాకాలక్షేపం చేసేవారూ, బాధ్యతారహితంగా ప్రవర్తించేవారు కూడా కనబడతారు. అయితే, వారికై వారే మారటం కద్దు, ఎవరి నిర్బంధం వల్ల కాకుండా, మారక వెళ్ళిపోవటమూ కద్దు. ఆవరణంలోని గొప్ప విశేషం ఏమంటే అక్కడ వుండే ప్రతివారిలోని లోటుపాట్లూ తక్కినవారిని సక్రమంగా వుండేలా మెరుగు పెట్టేందుకు అవసరమయ్యే ఒరిపిడికి ఉపయోగించ బడుతాయి. పనికిరానిదంటూ సృష్టిలో లేదంటే – ఆవరణంలో వ్యక్తుల్లోని చెడుకూడా మంచికే వినియోగించబడుతుంది. పరిపూర్ణంగా ఆవరణాన్ని ఎప్పుడూ తనదిగా చూచుకుంటూ దానిని సద్వినియోగం చేసుకోగలవాడికి యావత్ సృష్టి సొంత యిల్లే అయితీరుతుంది. రెండవది ఎంతకష్టమో, మొదటిదీ అంతే. సరాసరి ప్రపంచాన్ని ఉద్ధరిద్దామని బయలుదేరేవాడికి తనను తాను వంచన చేసుకునేందుకు సావకాశం వుందేమో కానీ ఆవరణంలో ఆ తావు లేదు. తన మీద తనకు నిగ్రహం ఏర్పడనిదీ ఆవరణంలో ఎవరు ప్రశాంతంగా ఎక్కువ కాలం ఉండలేరు. వారికిది అగ్నిపరీక్ష.

క్లుప్తంగా చెప్పాలంటే - జగత్తు - ఆవరణం, మన వ్యక్తిత్వం యీ మూడింటికి బ్రహ్మాండ, అండాండ, పిండాండాల కుండే సంబంధమే ఉన్నది. ఒకదాని రహస్యం తెలిస్తే మరోదాని రహస్యం తెలుస్తుంది. ఒకదానిని క్రమంగా సాధిస్తే సర్వాన్నీ సాధించవచ్చు. ఏ కట్టుబాటులూ లేని యీ ట్రయినింగ్ క్యాంపులో ఎవరి లోటుబాట్లే వారిని కట్టుబాటు చేస్తాయి. త్వరగా సక్రమంగా పూర్తి చేస్తే వారు జీవిత సమరంలో గెలిచినట్లే.

## 8. అమ్మ దర్శనం

అమ్మ దర్శనం లభించటం ఒక మహా అదృష్టం. "నాకేమీ తెలియదు" అని ఆమె తప్పుకున్నా ఒకప్పుడు కాకపోతే మరొక్షణంలో నయినా ఆమె నోటి వెంట అసలు సత్యం బైటపడుతుంది. ఆమె కటాక్షం లేనిదే జిల్లెళ్ళమూడి గడ్డ మీద కాలు కూడా పెట్టలేను. ఆమె దర్శనార్థం వెళదామనుకుంటూ వెళ్ళలేకుండానే జీవిత శేషం

గడిచిపోయే వాళ్ళెందరో మనకు తెలియదు. వెళదామనుకున్నాక చాలా కాలానికి గాని వెళ్ళని వాళ్ళను అనేకులను చూస్తున్నాము. పైన చెప్పినట్లు అమ్మ దర్శనం చేసుకుందామని తహతహలాడుతూనే వెళ్ళకుండానే జీవితరంగం నుంచి నిష్క్రమించిన వాళ్ళగతేం కావాలి ? లేక ఆమె దర్శనార్థం వెళదామనుకుంటే కొందరికి అనుకోని కష్టాలు, చిక్కులు ఎదురై ఆ ప్రయాణాన్ని బహుకాలం వెనుక కెందుకు నెట్టాలి ? అన్నవి మనకి మామూలుగా కలిగే సందేహాలే. ఎందుకంటే కొందరికి ఉద్యోగ ధర్మంలో సాధ్యపడనంతటి సావకాశాలు ఏర్పడి వీళ్ళను పదేపదే జిల్లెళ్ళమూడి పంపి అమ్మ దర్శనం కలిగిస్తాయి. అంతేకాక తొందరగా వెళ్ళవలసిన అవసరాలు కలుగుతుంటాయి కూడ :

వీటన్నింటికి వెనుక అమ్మ సంకల్పం ఉండనే ఉంది. పైన చెప్పిన తెగలే కాక ఆమె గురించి వినని వాళ్ళూ, విన్నా నమ్మని వాళ్ళూ. నమ్మినా "ఆమె సర్వాంతర్యామిగా మనం ఎక్కడున్నా కాపాడుతుంది" అని నమ్మి ప్రత్యేకించి దర్శనార్థం అర్కపురి వెళ్ళని వాళ్ళూ ఇంతమంది ఉన్నారు. వీళ్ళందరి సంగతి ఏమిటి ?

అమ్మ ఒకసారి అన్నారు.. **"తెలిసినా తెలియకపోయినా, చూచినా, చూడకపోయిన, నమ్మినా నమ్మకపోయినా, ద్వంద్వములు, ద్వంద్వముల కాధారమైనశక్తి ఒకటి ఉంటుందనీ, సర్వమూ తనే నడుపుకుపోతుందనీ తెలుసుకోవాలి"** అని. ఇది విననివాళ్ళకూ, విన్నా నమ్మని వాళ్ళకూ సమాధానంగా ఉపయోగపడుతుంది.

**"నన్నూ చూట్టానికి మీరు రావాలి. మిమ్మల్ని నేను చూడగలను"**

**"ఇంకొక ఊళ్ళో ఉంటే నేను చూడనుగదా అనుకుందామా అంటే ఏ అడ్డాలూ అడ్డు కావు నాకు."**

**"అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో మంచమ్మీద కూర్చున్న అమ్మే కాదుగా. అమ్మ అంటే ఆదీ అంత్యమూ లేనిదీ; ఆదీ అంత్యమూ అయినదీ."**

అన్న యీ వాక్యాలు అమ్మ గురించి విని వెళ్ళి దర్శనం చేసుకొనని వాళ్ళకు కూడా - వాళ్ళు నమ్మినా నమ్మకపోయినా - చక్కటి సమాధానాలు.

ఇలాగే యింకొక వాక్యమూనూ -

"అడగందే అమ్మయినా పెట్టదంటారు. అడిగితేనే కాని పెట్టనిది అమ్మ కాదు. అడక్కుండానే ఆకలి కనుక్కొని పెట్టేది అమ్మ."

ఒకరోజున అప్పుడే వచ్చిన వేదాంతం రామచంద్రరావుగారితో అమ్మ అన్నారు. "ఇది వరకు చూచాను (నిన్ను)" అని. అక్కడే కూర్చున్న ఒక అన్నయ్య వెంటనే అడిగారు. "నువ్వు చూడని వాళ్ళెవరమ్మా?" అని. "చూడని వాళ్ళు కనపడరిక్కడ" అన్నారు అమ్మ. ఈ వాక్యంలోని భావం మనకు అమ్మ దర్శనం లభించటానికి కారణం మన ప్రయత్నం కాదు. ఆమె సంకల్పమే ననిపిస్తుంది.

మరొకరోజున అమ్మ చాలామందితో మాట్లాడుతున్నప్పుడు నమస్కారము చేసుకోటానికి వెళ్ళితే "ఏమిటి?" అనడిగారు.

"నమస్కారం చేసుకుని వెడతాను" అన్నాను.

"ఏ ఊరు?" నవ్వుతూ అడిగారు.

"ఈ ఊరే" అన్నాను.

"ఈ ఊరుకు ఒక్క కాల్చాలు" అని ఒక్క పాదం నా ముందుకు చాపారు. నమస్కారం చేసుకున్నాను. కాని అలా అన్నారేమిటా అని ఆలోచిస్తూంటే మళ్ళీ అన్నారు.

"ఈ ఊరుకు ఒక్క కాల్చాలు" అని.

అప్పుడు స్ఫురించింది "ఈ ఊరికి ఒక్క కాల్ (అంటే యింగ్లీషులో పిలుపు అని అర్థం) చాలు" అన్నారని. అంటే ఆమె సంకల్పంలో ఒక్కసారి రమ్మని పిలిస్తే మన మింక జిల్లెళ్ళమూడి వెళ్ళక తప్పదని అర్థమయింది.

అమ్మని ఎప్పుడో ఎన్నో రోజులకొకసారి దర్శనం చేసుకోలేని వాళ్ళు దిగులుపడినా, వాళ్ళు చేసుకునే జపధ్యానాలు సక్రమంగా జరగటం లేదని ఎవరైనా దిగులు పడినా అమ్మ అంటారు.

"అవి సాగలేదని, యిక్కడికి రాలేక పోయామనీ దిగులుపడడం, ఎప్పుడూ అదే ధ్యాసలో ఉండడం కూడా ధ్యానమే. దిగులే జిజ్ఞాస. ధ్యాసే ధ్యానం" అని.

అమ్మే దర్శనం చేసుకోకూడదు అని ఒకప్పుడు అనుకున్నవాళ్ళూ, అమ్మను

పరోక్షంగా విమర్శించి దూషించిన వాళ్ళు కూడా ఒక క్షణంలో ప్రబలమైన ప్రేరణ వలన ఆమె దగ్గరకు వెళ్ళటం కూడా జరుగుతూ ఉంటుంది. వాళ్ళ గురించి అమ్మ అంటారు.

**"దూషణ కూడా ఒక రకమైన ఆరాధనే. ఆ రూపేణా అన్నా ఎక్కువగా గుర్తు పెట్టుకుంటారు. అన్ని నామాలూ నావే అని మీరు అంటున్నప్పుడు వాళ్ళు అనే నామాలూ అందులోవే కదా. మీరు మాత్రం ఏం చేస్తున్నారు ? విద్యాయై నమః అభి అంటూనే అవిద్యాయైనమః అనీ అంటున్నారు కదా ? అందువల్ల వాళ్ళు చేసే దూషణ కూడా నామ జపమే"** అని.

**"విన్నవాడు విమర్శిస్తాడు. కన్నవాడు వివరిస్తాడు"** అన్న అమ్మ వాక్యం అమ్మ దర్శనం చేసుకొనని వారు చేసే విమర్శల గురించి నొచ్చుకునే మనస్సులకు చక్కటి సమాధానం. అయితే ఒక్కసారిగా విముఖంగా ఉన్న వారిక్కూడా "అమ్మ దర్శనం చేసుకునేందుకు ప్రేరణ ఎందుకు కలగాలి?" అన్న ప్రశ్నకు సర్వసంకల్పాలూ తానైతే యితరుల మనస్సులోది తెలుస్తుంది. ఇతరుల చేత చేయించవచ్చు" అన్న అమ్మ వాక్యమే సరిఅయిన సమాధానం.

అమ్మను వదిలి దూరంగా పోతున్నామనో, లేక పునర్దర్శనం త్వరగా చేసుకోలేమనో వాపోయే వారితో అమ్మ అన్నారు :

**"అమ్మ మీ వెన్ను కాచుకునే ఉంటుంది"** అని.

వెనుక రమణమహర్షి దగ్గరకు అతిదూరదేశాల నుంచి వచ్చి వారి దగ్గర చాలాకాలం ఉండి తమలో ఏదేమయినా ఆధ్యాత్మిక పురోగతీ కనిపించటం లేదనీ వాపోయినట్లే అమ్మ దగ్గర కూడా కొంతమంది వాపోతారు. వాళ్ళతో అమ్మ అన్నారు :

**"వృథాగా రావటం లేదు. వచ్చే సంకల్పమే కొంత ఫలం. రావటం ఎక్కువ. తర్వాత వృథా ఎప్పటికీ కాదు"** అని.

మహర్షి కూడా వారి దగ్గర మొర పెట్టుకున్న వారితో చెప్పారట. వారిలో మార్పు కలుగుతున్నా వారికి తెలియవలసిన అవసరం లేదనీ, నిజంగా నిష్ప్రయోజనమే, అయితే అలా తోచిన మరుక్షణమే వెళ్ళగలిగే వారనీ, అలా వెళ్ళలేక ఉండిపోవటమే దానికి సూచన అనీ.

అమ్మ దర్శనార్థం రాకూడదనుకున్న వారు రావటం, రావాలనుకున్న వాళ్ళు రాలేకపోవటం, వచ్చి ఒకటి రెండు రోజుల్లో వెళ్ళిపోదామనుకున్న వాళ్ళు వారాలు వారాలు నిలిచిపోవటం, కొంత కాలం అమ్మ దగ్గర ఉందామనుకున్న వారు అకస్మాత్తుగా బుద్ధి మారినందువల్ల, అనుకోని పరిస్థితుల వలన వెళ్ళవలసి వస్తే అమ్మ అంటారు. **"ఇక్కడికి రావటం, ఇక్కడనుంచి వెళ్ళటం ఎవరి చేతుల్లోనూ లేవు అనుకున్నంత మాత్రాన రాలేరు. వచ్చే సమయం వస్తే వద్దనుకున్నా మానలేరు"** అని. నాకు వెంటనే షిర్డీ శాయిబాబా అన్న మాటలు గుర్తుకు వస్తాయి. "నా భక్తు లెంత దూరాన ఉన్నా కాకి కాలికి దారం కట్టి లాగితే వచ్చినట్లుగా నా దగ్గరకి రప్పించుకుంటాను" అని. ఎవరైనా అక్కడకు రావటం, పోవటం ఆమె సంకల్పం మీదే కాని మన చేతిలో ఏమీ లేదని తెలియజేసే సందర్భాలు రెండు మూడు చెపుతాను.

అమ్మ ఎవరి సంగతైనా ప్రస్తావిస్తే వారు వెంటనే అక్కడకు రావటం అమ్మ సన్నిధిలో వున్న వారికి అనుక్షణం కనిపించే నిదర్శన సహస్రాలలో ఒకటి. అక్కడ కూర్చున్న ఒక సోదరితో అమ్మ ఒకరోజు" కాశీరావన్నయ్యకు ఉత్తరం రాయమ్మా సెలవు పెట్టి రమ్మని. ఎంతో దూరాన ఉన్నాడు. మూడు నెలలయింది వాడు ఉత్తరం వ్రాసి....." అని అన్నారు. ఆ మధ్యాహ్నానికల్లా ఆ అన్నయ్య అమ్మ సన్నిధికి చేరాడు. అల్లానే పర్చూరు సుబ్బారావనే ఒక అన్నయ్యను గురించి అమ్మ. "వాడు బాగా పాడతాడు" అని అన్నారు. ఆ రోజు సాయంత్రానికి అతడు బస్సు దిగాడు. అలాగే 27, 10, 62 న ఉదయం 11 గంటలకు "రెడ్డిగారిని చూడాలని ఉన్నది" అన్నారు అమ్మ. సాయంత్రం 6 గంటలకల్లా ఆయన అమ్మ పాదసన్నిధికి చేరాడు.

అలాగే ఒకరోజు అక్కడ కూర్చున్న యిద్దరు పిల్లలతో ఆ ఊరు వాళ్ళే "మీరు యింటికి వెళ్ళండమ్మా" అన్నారు అకస్మికంగా. "ఎందుకమ్మా" అని వారు అంటూండగానే వారి కోసం కబురు వచ్చింది. ఇతర స్థలాల నుంచి వచ్చినవారిని కూడా అమ్మ తొందరచేసి ప్రయాణం చేయటం చాలాసార్లు జరుగుతూ ఉంటుంది. వారు యిళ్ళు చేరి ఇంటి దగ్గరనో, ఆఫీసులోనో అత్యవసర పరిస్థితులు ఏర్పడి తమ కోసం ఎదురు చూస్తుండగా తాము చేరామనీ, అమ్మ అట్లా ప్రయాణం చేయించటం ఎంతో ఉపయోగపడిందనీ వ్రాస్తారు.

## 9. కామదాయిని అమ్మ

"కామదాయిని" అంటే 'కోరిన వాటిని ప్రసాదించేది' అని ఒక అర్థం. కోరికలనే కల్పించేది అని మరొక అర్థం. రెండూ ఆ దైవానికై వర్తిస్తాయి. రెండూ అమ్మే.

కోరికలు పనికిరావనీ, అవే సంసారమనీ, అవి మనిషిని జనన మరణముల వలయంలోకి యీడ్చి నరకంలోకి కూడా లాగుతాయనీ వేదాంతులు చెబుతారు. కాని జ్ఞానులట్లా అనరు. అవీ భగవత్స్వరూపమేనని చెబుతారు. అమ్మ అంటారు. **"పనికి రానిదంటూ అసలు సృష్టిలో ఏదీలేదు"** అని. **"మీరంతా ఏమిటో కోరికలను చంపుకోవటం, జయించటం అంటారు. నాకు మాత్రం అట్లాతోచదు. నాకు అన్నీ, అందరూ, కావలనే వుంటుంది. నాకు ఏ రాహిత్యం అక్కర్లేదు. అంతా సహితమే"** అని. అందుకే కాబోలు రకరకాల కోరికలతో చెయ్యరాని దంటూ లేకుండా అన్నీ చేసి తన దగ్గర కొచ్చిన వాళ్ళతో కూడా **"తల్లికి తప్పే కన్పించదు"** అంటారు. అట్లానే షిర్డీ సాయిబాబాని ఒకసారి ఎవరో "సంసారం నుంచి మమ్మల్ని ముక్తుల్ని చెయ్యండి" అని కోరితే, "ఆ సృష్టికర్తకే సంసారం వుంది. ఈ సృష్టి అంతా సంసారమే. ఆయనకే అది తప్పనప్పుడు మనకెలా తప్పుతుందీ?" అని సమాధానం యిచ్చారట బాబా.

కోరికలూ, వాటి తత్వాన్నీ గురించి జాగ్రత్తగా పరిశీలిస్తే మామూలుగా వేదాంతులు వాడే "పడికట్టురాళ్ళు" (అమ్మ మాటలో చెప్పాలంటే) వంటి వేదాంత పరిభాషలోని వెలితి మనకర్థమవుతుంది. పాలు తాగే పిల్లవాడికి పళ్ళు వచ్చే సమయంలో చిగుళ్ళ దురద వల్ల కొరకటానికి గట్టిగా ఉండే ఆటవస్తువుల్ని కోరుతాడు. శరీరంలో కొన్ని రసాయన పదార్థాలు లోపిస్తే మట్టి సుద్దవంటి పదార్థాల మీద కోరిక కలుగుతుంది. ఈ లోపించిన పదార్థాలను శరీరానికి అందచేసినప్పుడు యీ కోరిక నశిస్తుంది. వెన్నులో బలం వస్తూంటే పసిబిడ్డకి బోర్లాపడి, మెడ ఎత్తి, క్రమంగా ముందుకి పాకాలనీ, నుంచోవాలనీ, నడవాలనీ, మాట్లాడాలనీ అన్ని వస్తువులనీ అందుకోవాలనీ కోరికలు కలగటం సహజం. ఊళ్ళో చదువుకునే, పిల్లవాడికి తనూ పెద్దవాడు కావాలనీ, తన తండ్రిలా తనూ స్వతంత్రుడు కావాలనీ కోరికలూ కలుగుతాయి. ఈ కోరికలన్నీ పిల్లవాడిలో కావలసిన పరిణామాలకు కారణము. రూపాంతరాలు కూడాను. పెరిగే ప్రతి బిడ్డలోనూ యీ కలలుండటమే ఆరోగ్యానికి

నిదర్శనం. యవ్వనంలో కలిగే కోరికకలుగూడా, శారీరకంగా వచ్చే మార్పుల వల్లనే. వైద్యశాస్త్ర వేత్తలు చెబుతారు. హార్మోన్సు, యిటు యీ కోరికలకీ, అటు శరీర నిర్మాణానికీ కూడా కారణాలనీ, ఇంకా యివికాక మనిషిలో కేవలం సుఖం కోసంగా కనిపించే అనేక కోరికలు ప్రతి జీవి హృదయంలోనూ వుండే స్వేచ్ఛ. శాంతి, సౌఖ్య, కాంక్షలనే సూచిస్తాయి. వీటి చరమదశే, మోక్షకాంక్ష. 'మోక్షం' అనే పదానికి స్వేచ్ఛ. శాంతి, ఆనందం, అనేవి పర్యాయపదాలు. అయితే యీ విషయం మనస్సుకి గోచరించేటంతటి మానసిక వికాసం మనస్సుకి కలిగి, యీ కోరికల పరమావధి, రూపం, స్వభావాల గురించి విచారణ చేసే స్థితి కలిగే లోపల ప్రతి తాత్కాలిక అవసరమూ, ఆ స్వేచ్ఛానందాల్ని ప్రసాదించే దానిలా ఆ క్షణంలో కన్పించటాన మనిషి ఆయా కోరికలను తీర్చుకునేందుకు, యేమేమో చేస్తాడు. ఆకాశాన్ని తాకాలనే పసిపిల్లవాడి కోరికకి దూరాన, భూమ్యాకాశాలు కలుస్తున్నట్లు కన్పించే దిక్చక్రం (horizon) ఆకాశాన్ని అందుకునేందుక సావకాశంలా కనిపించినట్లు; ఏ కోరికైనా అంతే. అది తీరేదాక అదే అంతా అయినట్లు తోస్తుంది. తీరాక ఏమిలేదని తోచి, మళ్ళీ మరో కోరిక తలెత్తుతుంది. ఈ కోరికలు, వీటిని నెరవేర్చుకునేందుకు మానవుడు చేసే ప్రయత్నమూ కూడా నిగూఢంగా మానవుడి హృదయంలో ప్రజ్వలించే మోక్షకాంక్షకి తార్కాణాలే. దీనికి నిరూపణ కావలసివస్తే మానవుడి వ్యసనాల్లో దేన్ని పరిశీలించినా దానితో తాత్కాలికంగానైనా మానవుడు తన పరిమితిని విస్మరించేట్టు చెయ్యటం ముఖ్య లక్షణంగా గోచరిస్తుంది. ప్రతి జీవి తనకు తెలిసో తెలియకో తను విస్మరించి కోల్పోయిన దైవస్థితి కోసం పరితపిస్తూనే వుంటుంది. అదే అసంతృప్తికి కారణం, కోరికలకి కారణం. కోరికలని కృత్రిమంగా అణుచుకుంటే అత్యవసరమైన పరిణామం మందగిస్తుంది. "కామి గాక మోక్షకామి కాదు" అన్న లోకోక్తికి బహుశః అర్థం యిదేనేమో ? అందుకే కబీరు నక్షత్రం మండలాల దగ్గర్నించీ యావత్సృష్టీ భగవంతుణ్ణి అర్చిస్తున్నట్టు వర్ణించాడు. శ్రీకృష్ణుడు కూడా సర్వజీవకోటీ తననే వివిధ కార్యాల రూపంలోనూ. కామ్యాల రూపంలోనూ, దైవాల రూపంలోనూ అర్చిస్తున్నాయన్న భావం స్ఫురించేట్టు చెప్తాడు గీతలో.

ఐహికావసరాలను చాలవరకూ నెరవేర్చుకోగల అమెరికా, రష్యా వంటి దేశాలు కూడా ఎంతో ధనాన్ని వ్యయంచేసి కాలాన్ని. అంతరిక్షాన్ని పరిశోధించాలనీ, సాధించాలనీ చేసే ప్రయత్నంలోనూ, వైద్యనైపుణ్యంతో మరణాన్ని అరికట్టాలని చేసే

ప్రయత్నంలోనూ మానవుడి ముక్తి కాంక్ష వ్యక్తం అవుతుంది. ఒక్క కోరికే యిన్నికోరికల్లా వ్యక్తం అవుతుంది. ఒకే దైవం అనంత వస్తు సముదాయంగా భాసించినట్లు. ఇదేనెమో "అంతా సహితమే" అన్న అమ్మ మాటల కర్థం.

మనస్సులో అనంతంగా చెలరేగే కోరికల పరిణామమే "కోరికే అశాంతి" అన్న వివేకాన్ని కల్గించేది. అప్పుడు కాని మానవుడి మనస్సు కోరిక యొక్క తత్త్వాన్ని పరిశీలించి. పరిశోధించి దానికి మూలమైన ఇచ్ఛా. క్రియా, శక్తులనీ, వాటికాధారమైన ఆత్మని అవగాహన చేసుకోలేదు. ఈ స్థితి అన్ని స్థితులకి మల్లేనే దానికై అదే రావాలి. సాధించేది కాదు. కృత్రిమంగా సాధిస్తే కృత్రిమమే అవుతుంది. అందుకే భగవద్గీతలో కూడా కాలంలో భక్తుడు ప్రపన్నుడవుతాడని వున్నది. రమణ భగవాన్ కూడా ఆయన ప్రసంగాలలో ఒకచోట తానేమీ సాధన చెయ్యలేదనీ, ఆశక్తే అన్నీ చేయించిందనీ చెప్పారు. **"సాధ్యమైతేనే సాధన చేసేది"** అన్నది అమ్మ వాక్యం. ఆత్మ తనకై తాను ఎవర్ని ఎన్నుకుంటుందో వాడికే సాక్షాత్కరిస్తుందన్నది కఠోపనిషద్వాక్యం. జూడాస్ తనను మోసం చేస్తాడనీ, సెంట్ పీటర్ తనని చివరి క్షణంలో విడనాడతాడనీ క్రీస్తు ముందుగా చెప్పినా అట్లానే జరగటం దీనికి తార్కాణం. అందుకే అమ్మ అంటారు తను పరుగెత్తేవాడితో పరిగెత్తి పట్టుకోననీ, పరిగెత్తి అలసి ఆగిపోయాక పట్టుకుంటాననీ : కోరికల పరంపరలతో విసిగి వాటికి కారణాన్ని అన్వేషించటాన్నే అమ్మ అలిసి ఆగినవాణ్ణి పట్టుకోటం అని చెప్పారని నా ఉద్దేశం. కోరికలే మనని వదలాలన్న దానికి కొక ఆధారం : "అమ్మా, మీరు అన్నాన్ని విడిచారట గదా?"అవి ఎవరో అడిగితే **"అన్నాన్ని నేను విడిచి పెట్టలేదు. ఆహారమే నన్ను విడిచి పెట్టింది"** అన్నారు అమ్మ.

దీన్ని బట్టి చూస్తే కోరికలు కలగటం, వృద్ధి అవటం, తర్వాత క్రమంగా అంతరించటం అన్నీ కాలానుగుణంగా వాటికై అవి జరిగేవే నని తోస్తుంది. అయితే సహజంగా పండు పండటానిక్కానీ, మానవుడు వయస్సుతో పెరగటానిక్కానీ బయట సూర్యరశ్మి. లోపల వివిధ గ్రంధులు ఎలా తోడ్పడతాయో అల్లానే భగవంతుడిదయ, సర్వకాల సర్వావస్థలయందూ కాలస్వరూపంతో అన్నింటినీ జరుపుకుంటుంది. "అన్నింటినీ ఆ శక్తే చేయిస్తుంది" అన్న అమ్మ వాక్కు వేదవాక్కు. దాన్ని అంగీకరించగలగటం, అంగీకరించలేకపోవటం మనలో జరిగే యీ సహజ పరిణామాలకి చిహ్నామే. అంతా అయి మనలో అన్నీ చేయించే శక్తి అమ్మ. అందుకే

అమ్మ అర్ధం కానిదీ, అంతులేనిదీ, అడ్డులేనిది, ఆధారమైనదీ అంతా అయినదీ అయి జిల్లెళ్ళమూడిలో మానవ రూపంలోను, ప్రపంచరూపంలోనూ, అందులోనూ మనలోని మనరూపంలోనూ, తనకి తానే వ్యక్తం అవుతారు. అందుకే ఆమె ఎప్పుడూ ఆత్మావలోకినే, అన్నింటిలో తననీ, తనలో అన్నింటినీ చూచుకుంటారు అమ్మ. మోక్షకాంక్షా, మనలోని కోరికలు యివన్నీ ఆమె రూపాలే: ఆమే: ఆమెలీలే. “నాకు 'అది' అనిపించదు నాన్నా, 'ఇదే' అని తప్ప అని అమ్మ అంటారు. అందుకే ఆమె కామదాయిని. కామదాయిని కాబట్టే కామహారిణి కూడా అయినారు.

## 10. అమ్మ - క్రీస్తు

“ఏసయ్యా-వచ్చావా?”

“ఏసయ్య కాదమ్మా. ఈమె ఏసయ్యను కన్నతల్లి - మరియమ్మ.”

ఇవి 1962లో అమ్మ బాపట్ల కుష్ఠ ఆసుపత్రిలోని రోగులను చూచిరావటానికి వెళ్ళినపుడు ఆమెను చూచి యిద్దరు రోగులు అనుకున్న మాటలు. డిసెంబర్ 25 వ తేదీ దగ్గరపడ్డప్పుడల్లా యీ మాటలు నా స్మృతి పథంలో చెర్చి గంటల్లా మారుమ్రోగి శతాబ్దాలక్రితం భూమిమీద మానవరూపంలో సంచరించిన ఆ పవిత్ర త్యాగమూర్తి జీసస్‌కీ యీనాడు మనమధ్య ప్రేమరూపిణిగా సంచరిస్తున్న అమ్మకూ గల పోలికలు గుర్తుకు వస్తాయి. ఈ యిద్దరు అవతారమూర్తులూ మహాజలపాతాల్లా హృదయంలో ఆనందాన్ని పరవళ్ళు తొక్కిస్తుంటే ఆ ఘోషలో యిద్దరి మధ్యా ఉన్న శతాబ్దాల కాలం మూగవోతుంది.

వీరిద్దరూ యిద్దరు మూర్తులుగా రెండు దేశాలలో కాలాల్లో అవతరించినా ఒకరినుండి, యింకొకరు భిన్నంగా ఉన్నట్లు తోచవచ్చు కాని అది కేవలం ఒకే విద్యుత్తుతో భిన్నంగా ప్రకాశించే రెండు గదులలోని రెండు రంగుదీపాల్లాగానే ఉంది. ఉన్న అంతర్యంలో ఒక్కటే. ఈ పోలికలను స్మరించుకుని ఆనందించటమే ఈ రచన యొక్క లక్ష్యం.

జీసస్ 'సహజమైన పాపం' లేకుండానే జన్మించాడనీ, జన్మతఃనే పుత్రుడనీ బైబిల్ చెబుతుంది. అంటే భగవదాదేశాన్ని ప్రధమ మానవ దంపతులు ఆడమ్ ఈవ్‌లు ఉల్లంఘించినందుకు వారికీ వారి సంతతికీ పాపం, దానితోపాటు మృత్యువు సంక్రమించాయనీ, తత్కారణంగా ప్రతి మానవుడూ జన్మతః పాపంలో పుడతాడనీ

వారి సిద్ధాంతం. ఈ పాపం లేకుండా లేకుండా జన్మించాడు క్రీస్తు. ఈ బైబిల్‌లోని కథను గురించి యోచిస్తే యిందులో సంకేత మాత్రంగా నిగూఢమైన సృష్టి రహస్యం యిమిడి ఉందనిపిస్తుంది. అజ్ఞానం లేక అహంకారం మనిషి యొక్క జన్మకు కారణం అనీ, సృష్టి అంతా బ్రహ్మ దేవుని అహంకారం యొక్క ఫలితమేననీ చెపుతారు కొందరు. ఈ రెండూ ఒకటేనని నా ఉద్దేశం. ఆ పాపం లేకుండా జన్మించటం అంటే సహజంగా తనకీ – భగవంతుడికీ భేదం లేదనే సంపూర్ణ జ్ఞానంలో క్రీస్తు జన్మించాడని అర్థం అనిపిస్తుంది. అంటే ఆయనలోని దైవత్వం ఏ సాధన వల్ల వచ్చింది కాదు సహజమైనది. అమ్మ కూడా అంతే సాధన లేకుండానే **"అంతా అయినదీ అర్థం కానిది"** అయిన అమ్మే యీ అమ్మగా పరిమితమయిన రూపం దాల్చిందని ఆమె చరిత్ర చదివితే తెలుస్తుంది.

ఇటువంటి దైవమూర్తులు అవతరించటానికి ముందుగానే అనేక రకాలుగా వారి తల్లిదండ్రులకు సూచించబడడం మనం చదువుతుంటాము. జీసస్ జననం చాలా చిత్రమయినది. తండ్రికి, గర్భిణి అయిన మరియమ్మ మీద అనుమానం కలిగి ఆమెను మౌనంగానే వేరుచేశాడు. అప్పుడు ఆయనకు స్వప్నంలో ఒక దేవదూత దర్శనం యిచ్చి "మరియమ్మ గర్భంలో ఉన్నది భగవంతుని బిడ్డ... ఆయన మానవులను పాపం నుంచి రక్షిస్తాడు" అని చెప్పి మాయమయ్యాడు. అమ్మ జననానికి కూడా కొంచెం ముందు ఆమె తండ్రి సీతాపతిగారు పొన్నూరులో ఒక చింతచెట్టు క్రింద గతించిన బిడ్డలకోసం చింతిస్తూ కూర్చుని ఉన్నప్పుడు అకస్మాత్తుగా ఒక దర్శనమయింది. ఒక 7సం॥ల బాలిక తనముందు నిలిచి వెంటనే చెన్నకేశవ రాజ్యలక్ష్ములుగా మారి.... తిరిగి బాలికగా కనుపించి అంతర్ధానమయింది. ఆ క్షణంలో ఆయన తనకు కలిగింది చిత్తభ్రాంతి అనీ, అందులో తను చూచింది. అంతకుముందు గతించిన తన 7సం॥ల బిడ్డేననీ సమాధానపడ్డారు. తర్వాత కొంత కాలానికి రంగమ్మ గర్భవతి అయింది. అప్పుడాయనకు ఒక కల వచ్చింది. అందులో తన యింట్లోని సామానంతా ఎవరో ఖాళీచేసి యింటిబయట పారేసినట్లు, నట్టింట్లో ఒక కుర్చీలో పెద్ద బొట్టుతో ఒక ముత్తయిదువ కూర్చుని ఉన్నట్లు కనిపించినది. "నీవెవరు?" అని ఆయన అడిగితే "నేను అమ్మను" అని ఆమె సమాధానం యిచ్చింది. తెల్లవారగానే సీతాపతిగారు తనకు ఆప్తుడూ, దైవజ్ఞుడూ, చందుర్తి గ్రామం కరణంగారూ ఆయిన పెమ్మరాజు సత్యనారాయణమూర్తిగారిని తన కలకు అర్థం చెప్పమని కోరారు. ఆయన

రంగమ్మ గర్భంలోని శిశువు దైవమనీ, మానవ కల్యాణార్థం జన్మించ పోతోందనీ చెప్పారు.......... ఈ సంగతులన్నీ సీతాపతిగారే స్వయంగా నాతో అమ్మ సమక్షంలో చెప్పి "నాకు ఆ రోజుల్లో యీ దృష్టే తక్కువ. అందుకనే యింతకాలం మాయలో పడవలసి వచ్చింది. ఆనాడు నా కలలో కనిపించింది యీ అమ్మేనని యిప్పుడు అర్థమవుతున్నది. ఆ పిల్ల చెన్నకేశవస్వామిగా, రాజ్యలక్ష్మి అమ్మవారుగా కనుపించేటప్పుడు అయినా నేను ఊహించలేకపోయాను. అది తానే దైవమని సూచన చేస్తున్నట్లు, పిల్లలు కావాలని నేనే చెన్నకేశవస్వామిని ఆరాధించాను......." అన్నారు. తర్వాత ఆయన అమ్మలో కొద్దికాలానికి లీనమై పోతారనగా అమ్మను తన యిష్టదైవంలా అలంకరించుకుని పాదపూజ చేసుకున్నారు. చివరకు వారి పెద్దలకు అబ్దీకం పెట్టేటప్పుడు కూడా అమ్మకే పూజచేసుకున్నారు. ఈ విధంగా యీ నాడు అమ్మ గుర్తించబడడం కూడా ఆయన కారోజే స్వప్నంలోనూ దర్శనంలోనూ సూచింపబడ్డాయి.

ఇద్దరి జీవితాల్లోనూ యింకొక సామ్యం ఉన్నది. ఇద్దరిలోని దైవత్వమూ వారి బాల్యంలోనే అనేకులు గ్రహించారు. అమ్మ జన్మించిన క్షణాల్లో మన్నవలోని దేవాలయంలో కల్యాణోత్సవం జరుగుతూఉంది. గర్భగుడి నుండి విగ్రహాలను బయటకు తీసుకు వస్తూ గంటలూ, వాయిద్యాలూ, శంఖం మ్రోగిస్తూ జండాలతో ఊరేగింపు సాగే క్షణాల్లో అమ్మ జన్మించింది. అదే సమయంలో అప్పుడే జన్మించి ఏడవకుండా ఉన్న అమ్మను ఏడిపించాలని యింట్లో పెద్దగా చప్పుడు చేయబడడం దైవానికీ అమ్మకూ ఐక్యత చూపడానికి గాక మరేమిటీ ?

అంతేగాదు, అమ్మ జన్మించిన సమయంలో అక్కడున్న మంత్రసాని దగ్గర నుండీ, అందరికీ వింతైన దివ్యదర్శనాలయ్యాయి.

తర్వాత అమ్మకు మూడవ ఏట అమ్మను తీసుకుని రంగమ్మగారు తెనాలి వెళ్ళినప్పుడు రంగమ్మగారితో ఒక సాధూవూ, ఏడవ ఏట తిరువళ్ళూరు వెళ్ళినప్పుడు మరొక సాధువు సీతాపతిగారితోనూ 'అమ్మ దైవ' మన్న రహస్యాన్ని వెల్లడించారు. జీసస్ జన్మించినప్పుడు కూడా అల్లాగే జరిగింది. ఆకాశంలో వింత నక్షత్రం గోచరించి ప్రాగ్దేశాలలో పండితులకు క్రీస్తు వద్దకు దారి చూపిందట. ఆ ప్రాంతంలో గొఱ్ఱెలను కాచుకుంటున్న వారికి అనేక దివ్య దర్శనాలు కలిగాయట. పసిబాలుడయిన జీసస్‌ను ఆలయంలోకి తీసుకుపోయినప్పుడు అక్క సిమియన్, అన్న ఒక ముసలి సాధువు.

అన్నా అనబడు ఒక మహాత్మురాలు యిద్దరూ జీసస్‌లోని దైవత్వం, అతని భావి భాగ్యోదయాలను ముందుగానే ప్రకటించారట.

ఇద్దరూ చాలా చిన్నవయస్సులోనే అసహజమైన మేధాశక్తినీ, ప్రజ్ఞనీ వ్యక్తం చేశారు. జీసస్‌కు నిండుగా 12సం॥లు రాక ముందే తల్లిదండ్రులతో జెరుసలెం పట్టణానికి వెళ్ళి అక్కడ మారు పడ్డాడట. మూడు రోజుల తర్వాత ఎక్కడో ముగ్గురు మహా పండితులతో వాగ్వాదం జరుపుతూండగా కనుక్కోబడ్డాడట. అమ్మ తన తాతగారైన చిదంబరరావుగారితోను, తాతమ్మ మరిడమ్మగారితోను 4వసం॥లో సలిపిన సంభాషణలు వింటూంటే అదే గుర్తొస్తుంది. 7వ సంవత్సరంలో మహాపండితుడు, పీఠాధిపతి అయిన శ్రీకళ్యాణానందభారతిగారితో ఆమెకు జరిగిన సంభాషణ పత్రికలో ప్రచురితమైంది. జీసస్‌ని ఆయన తల్ల తండ్రులు ఎందుకు తప్పించుకు పోయావ్ ? అని అడిగితే 'నా తండ్రి (భగవంతుడు) పనిమీద వున్నాను' అన్నాడట. అమ్మను "నన్ను నాయనా అంటావెందుకు" అని శ్రీ కళ్యానంద భారతి స్వాములవారు అడిగితే "అది నా విధి ....... విధే విధానం" అని అమ్మ సమాధానమిచ్చింది :

ఇద్దరూ జన్మతః దైవస్వరూపులే అయినా, వారిలోని దైవత్వాన్ని గుర్తించిన వారు అనేకమంది వున్నప్పటికీ వారి దైవత్వం చాలాకాలం జనబాహుళ్యం నించి మరుగుపడేవున్నది. క్రీస్తుకి ముప్పై సం॥లు నిండిన తర్వాత అతని ఖ్యాతి అగ్నిలా అ పరిసర ప్రాంతాలలో వ్యాపించింది. (లూకా 4 : 14) అలానే అనసూయమ్మ జిల్లెళ్ళమూడి అమ్మగా అందరికీ తెలియటం ఆమెకు ముప్పైదాటాకనే. రాజమ్మ గారితో జరిగిన సంభాషణలోనే తనకు 33వ సం॥వస్తే కాని ఏమీ జరుగదు అని అమ్మే స్వయంగా అన్నది. అన్నట్లే 33వ సం॥నించి అమ్మ అందరికీ తెలియ నారంభించింది.

వీరిద్దరి మధ్యా సామ్యం జీవిత విశేషాల వరకే పరిమితం కాదు. వారి మాటల్లో కూడా చాలా సారూప్యం వుంది. ఇద్దరూ ఏ ధర్మాలను ఆచరించి వాటి ద్వారా దేన్ని పొందవలసిన అవసరం లేకపోయినా యిద్దరూ స్వచ్ఛమైన ఆచారాన్ని ఆచరిస్తూనే వచ్చారు. జాన్ జీసస్‌తో అన్నాడు. "నేనే నీ వద్దకి ఉపదేశానికి (బాప్టిజమ్) రావలసినంతటి వాడివి. నువ్వు నా దగ్గరకు రావటం ఏమిటి ?" అని "అన్ని సదాచారాలని ఆచరించటం మనకు యుక్తం" అన్నాడు జీసస్. అమ్మ గృహిణిగా ఆమె ధర్మాన్ని ఎంత ఆదర్శంగా నెరవేర్చుకుందో చిన్నప్పటినుంచి సన్నిహితంగా వున్నవారు చెపితే వినాలి. "సరే" అన్నమాటేగాని "కాదు" అని ఎప్పుడూ భర్త మాటకి

సమాధానం చెప్పలేదని విన్నాను. ఇంటి పనులన్ని కష్టం అనుకోక చేసుకుంటూ అందులోనే సర్వ సాధనలు యిమిడి వున్నాయన్న సత్యాన్ని మానవజాతికి క్రియారూపకంగా దారిచూపుతూ యీనాటికి వివాహితులు "మాకు మార్గం ఏమిటమ్మా" అంటే మగవారికి ఏకపత్నీ వ్రతం, ఆడవారికి పాతివ్రత్యం మార్గాలని చెబుతుంది. సగుణోపాసనలో విగ్రహాన్ని దేవుడికి సంకేతంగా పెట్టుకొని సర్వాన్ని దానివల్ల పొందాలని చేసే యత్నం లాంటిదే భర్తకి చేసే సేవ అని ఎప్పుడూ అమ్మ అంటూనే వుంటుంది. పెళ్ళిళ్ళు జరిపించేటప్పుడూ, పిల్లలచేత నోములు పట్టించేటప్పుడూ ధర్మాన్ని తూ.చ. తప్పకుండా నడిపిస్తుంది. తన మంగళసూత్రానికి అభిషేకం చేసి ఆ నీటిని అమ్మ తీర్థంగా తీసుకోవటం చాలా మందికి తెలిసినదే.

అయితే క్రీస్తు జీవితంలో కొన్ని చిత్రమైన అంశాలున్నాయి. ఆయన యూదుల ఆచారానుసారంగా చేతులు కడుక్కోకనే సామాన్యుల సహపంక్తిలో భోజనం చేసినందుకు వెలివేయబడ్డాడు: అట్లానే పర్వదినాన (సెబ్బత్‌డే) జనానికి రోగనివారణ చెయ్యటం, ఉపవాస దినాన తన శిష్యుల చేత భోజనం చేయించటంలాంటి వాటిలో కూడా తీవ్ర విమర్శకు గురి అయ్యాడు. ఆచారాల్లోనూ నమ్మకాల్లోనూ అవసరమయిన వాటిని ఎంత శ్రద్ధగా ఆచరించాడో అంతగానూ వెట్టి నమ్మకాలను కాలదన్నాడు. ఈనాడు అమ్మను గురించి కూడా అట్లాంటి విమర్శ వింటూంటాము. అనుభవము, ఆచరణ లేని శుష్క సంప్రదాయాలను గురించి వాగేవారు యదార్థం తెలుసుకోకుండా విమర్శించటం ఆనాడూ ఉంది. యీనాడూ వుంది. అమ్మ వర్ణ సంకరం చేస్తుందని...... యింకా యిటువంటి అర్థరహితమైన ఆరోపణలు చాలా ఉన్నాయి. అయితే ఆయా అవతారమూర్తులవల్ల తరింపబడేవారు తద్విరుద్ధమయిన వారినించి వేరు పడడానికి చేటలా ఉపయోగపడతారు. ఇటువంటి విమర్శలు "వింటే విమర్శగాని కంటే విమర్శలేదు విన్నవాడు విమర్శిస్తాడు కన్నవాడు వివరిస్తాడు" అన్న అమ్మ వాక్యాలు యదార్థాలు. అయితే "కళ్ళున్నా చూడలేరు, చెవులున్నా వినలేరు" అని జీసస్ తన కాలపు మూర్ఖుల గురించి అన్న మాటలే యీనాడూ వర్తిస్తాయి. ఈ మాటకు అమ్మ ఒప్పుకోదు. "వాళ్ళకూ అమ్మనే వాళ్లనూ సకాలంలో సంస్కరించవలసింది నేనే. వారి తప్పేం లేదు. వారికా దృష్టి నేనే యివ్వలేదు. నాకు అవసరం అని తోచినప్పుడు యిస్తాను" అంటుంది. మూఢ నమ్మకాలను, స్వార్థం కోసం వాటిని సంఘంలో ప్రచారం చేసి ప్రజలను "గురువుల" మంటూ మోసం చేసే వారి వాదాన్ని బట్టబయలు

చెయ్యటంలో క్రీస్తుకు అమ్మ, అమ్మకి క్రీస్తు మాత్రమే సాటి. అంతేకాదు ఎంతో చదివి, ఎంతో తెలుసుకున్నా మన్న గర్వంతో తూగేవారికి ఏమీ అర్థం కాకపోవటం లోనూ, ఏమీ తెలియనివారికి తన ఔన్నత్యం తెలియపరచటంలోనూ యిద్దరూ ఒక్కటే "తండ్రీ ! తెలిసిన వారి నుంచి యీ విషయాలను మరుగు పరచి. పసివారికి ఎరుక పరచినందుకు నా ధన్యవాదాలు" అన్నాడు క్రీస్తు. "తెలియని వారికి తెలిసెడి నీవే తెలిసిన వారికి తెలియవదేమో....." అని అమ్మను కీర్తించాడు రాజు.

జీసస్ లాగానే అమ్మ తను ప్రత్యేకం పాపులను ఉద్ధరిస్తానంటుంది, **"అర్హతలంటూ మాట్లాడితే 7 వ మైలు దాటి ఒక్క అడుగు కూడా ఎవ్వడూ రాలేదు"** అన్నది అమ్మ ఒకసారి. **"తల్లికి తప్పే కనుపించదు"** అన్నది మరొకసారి. **"తల్లికి అందరి బిడ్డల మీద ప్రేమ సమానమే అయినా సరైనా మార్గంలో పోయేవాడి గురించి కంటే తప్పుదారి పట్టిన వాడి గురించే ఎక్కువ ఆలోచన, శ్రద్ధ అవసరం"** అంటుంది అమ్మ. "99 మంది న్యాయ స్వభావులు, పశ్చాత్తాపం అవసరం లేని వారి కోసం కంటే పశ్చాత్తాపం చెందిన ఒక పాపి గురించి స్వర్గంలో సంతోషం ఎక్కువ ఉంటుంది" అన్నాడు క్రీస్తు. స్వస్థతగా ఉన్న వారికి వైద్యుడవసరం లేదు. జబ్బుగా ఉన్న వాళ్ళకే. "నేను సన్మార్గుల నుద్దరించటం కోసం కాదు, పాపులను పశ్చాత్తాపం చెందించటం కోసం వచ్చాను" (మార్క్ 2 : 17) పతనమయిన ఒక స్త్రీని రాళ్ళతో కొట్టి చంపాలని జనం ప్రయత్నిస్తే క్రీస్తు అడ్డు వచ్చి "మీలో లేశ మయినా పాపం లేని వాడెవడయినా మొదటి రాయి వెయ్యండి" అని సవాలు చేశాడు. కాని ఒక్కరూ ముందుకు రాలేదు. **"పాప పుణ్యాల కాధార మయిన గుణాలను ప్రసాదించిన భగవంతుడే మంచి చెడులకు బాధ్యుడు. ఆ రెండూ నీవి కావనిపిస్తుంది నాకు"** అంటుంది అమ్మ. అందుకే ఎవ్వరూ ఎవర్నీ విమర్శించటం ఆమె సహించదు. అంతా అది నిర్ణయం చేసిన భగవత్సంకల్పం మీద ఆధారపడి ఉంటుందని, ఆ సంకల్పం 'తరుణం'గా కాలంలో ఆయా పనులను జరిపిస్తూ ఆయా పరిస్థితులను కల్పిస్తూ సృష్టిలో ప్రతి పరిణామాన్నీ విధించటమే తన విధానంగా చేసుకుంటుందనీ, దానినే విధి అంటామనీ, ఇవన్నీ నిర్ణయించే దెవరంటే అంతా అయినదీ అర్థం కానిదీ ఆధారమయినదీ అయిన అమ్మ అంటుంది అమ్మ. క్రీస్తు మాటల్లో కూడా యిదే భావం వ్యక్తం అవుతుంది. "ఎవడికైతే ఉన్నదో (భగవన్నిర్ణయంలో) వాడికి (అది) ఇవ్వబడుతుంది : ఎవడికైతే లేదో వాడి దగ్గిరనుండి వాడికి ఉన్నట్లు కనిపించేది కూడా తీసేసుకోబడుతుంది" అన్నాడు. జూడాస్ తనను

వంచించటానికి (భగవంతునిచే) నిర్ణయించబడ్డారని క్రీస్తే అంటాడు. అట్లాగే తెల్లవారి కోడి కూసే లోగా మూడుసార్లు తనకేమీ తెలియదని పీటర్ తనను త్యజిస్తాడని కూడా క్రీస్తు ముందుగానే చెబుతాడు. పీటర్ జాగ్రత్త పడాలనుకున్నా ఆ సమయానికి అట్లానే జరుగుతుంది.

అమ్మ **"శిక్షించటం తన విధానం కాదనీ, రక్షించటమే తన విధానమనీ"** అంటుంది. క్రీస్తు కూడా తన మానవుల పాప పుణ్యాలను నిర్ణయించటానికి రాలేదనీ, రక్షించటానికి మాత్రమే వచ్చాననీ అంటాడు. జీసస్‌కు స్వాగతమివ్వని సమారిటన్లను దివ్యాగ్నితో దగ్ధం చేస్తామన్న తన శిష్యులను మందలించి తను మానవులను నశింప చెయ్యటానికి రాలేదనీ, రక్షించటానికే వచ్చాననీ అన్నాడు.

"చెడుకు తిరిగి ప్రతి చెయ్యవద్దు" అన్నాడు క్రీస్తు. అమ్మ సిద్ధాంతం కూడా అంతే. అమ్మను విపరీతంగా ఒకప్పుడు ద్వేషించినవారే ఆమె ప్రేమకు పాత్రులై బిడ్డలై ఆమెను చేరుతుండడం మనం చూస్తున్నాము.

"అమ్మా! మీదర్శనం యీనాడు లభించింది. ఏనాడు ఏం పుణ్యం చేసుకున్నామో.." అంటే ఎవరయినా "మీరు చేసుకున్నదేమీ లేదు. నేను రప్పించుకోవటమే" అంటుంది. అమ్మ.

**"చూస్తే కనపడను. కనబడితే చూస్తారు"** అన్నది అమ్మ. దీనికి తార్కాణంగా రాబోయే వ్యక్తుల గురించి అమ్మ ముందుగా సూచించటం, అమ్మ ముందుగా చెప్పిన కాల పరిమితి ప్రకారం చీరాల సోదరులు తరుచుగా ఆమె దగ్గరకు రాలేకపోవటం జరిగాయి. క్రీస్తు కూడా తన శిష్యులతో "మీరు నన్ను ఎన్నుకోలేదు. నేనే మిమ్మల్ని ఎన్నుకున్నాను" అన్నాడు. "ఒక్క తండ్రి (భగవంతుడు) తప్ప మరెవ్వరూ కొడుకును (క్రీస్తును) తెలుసుకోలేరు. తండ్రిని (దైవాన్ని) కూడా కొడుకు (క్రీస్తు) తప్ప మరెవ్వరూ తెలుసుకోలేరు. తండ్రిగానీ కొడుకుగానీ తెలియపరిస్తే తప్ప" అని కూడా అన్నాడు.

ఇద్దరూ చేసిన మహత్యాలలో కూడా కొంచెం సారూప్యం ఉంది. క్రీస్తు తను కేవలం భగవత్సంకల్పానుసారంగానే వ్యవహరిస్తున్నానన్నాడు గానీ తానుగా ఏమీ చేస్తాననలేదు. అమ్మ కూడా **"నిర్ణయించిన నిర్ణయమే తానైన అమ్మే అన్నీ చేస్తుంది. మన చేతుల్లో ఏమీ లేదు ఆది సంకల్పానికి భిన్నంగా ఏదీ జరుగ"**దంటుంది. **"మీకు మహత్యం అనిపించేది నాకు సహజమనిపిస్తుంది"** అంటుంది. "సృష్టిని మించిన

**మహత్యం** ఏముంది? అని ప్రశ్నిస్తుంది. ఆమె సమక్షంలో జరిగే అద్భుతాలను కూడా తను చేస్తున్నాననదు. **"అట్లా జరుగవలసి ఉన్నాయి కనుక జరుగుతున్నాయి"** అంటుంది. కాని ఆమె దయ వల్ల ఆమె దైవం అన్న దృఢ విశ్వాసం ఏర్పడ్డ వారితో **"నా ద్వారా పొందే దంటూ ఏముంది? నేను అమ్మను. అమ్మ ద్వారా పొందే దేముందీ? అమ్మను చూడటమే"** అంటుంది. **"అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో మంచం మీద కూర్చున్నదే అనికాదు. అమ్మ అంటే అంతులేనిది. ఆధారముయినది. అది అంత్యము లేనిది. అది అంత్యం అయినది. అంతా అయినది, అర్ధం కానిది"** అని అమ్మ తన మాటకు తనే అర్ధం చెపుతుంది. అట్లానే క్రీస్తు కూడా నేను నా తండ్రీ ఒక్కటే (జాన్ 10 : 30) నన్ను చూచినవాడు నా తండ్రిని చూచినవాడే; ఇంక నీవు తండ్రిని (దైవాన్ని) చూపించమంటావెందుకు?" (జాన్ 14:9) అనీ, "నేనే సత్యం, నేనే మార్గం, నేనే జీవం" (జాన్ 4 : 6) అనీ అన్నాడు.

ఈ సామ్యాలన్నింటిని పరిశీలిస్తే...... అమ్మ తనే అంతా ఆయిన అమ్మగా మాట్లాడితే క్రీస్తు తను వేరు, భగవంతుడు వేరుగా మాట్లాడేమన్న ప్రశ్న సమాధానపడుతుంది.

ఇద్దరి ద్వారా జరిగిన మహాత్మ్యాలలో కూడా పోలిక ఉంది. క్రీస్తు అయిదు రొట్టె ముక్కలను, రెండుచేపలను అనేకంగా మార్చి కొన్ని వేలమందికి ఆకలి తీర్చాడు. రోగులను, బధిరులను, అంధులను, మృతిపొందిన వారిని స్పర్శ మాత్రంచేత ఆరోగ్యవంతులను చెయ్యటం మనం బైబిల్లో చదవవచ్చు. తన శిష్యులకు కూడా యీ శక్తులను ఆయన ప్రసాదించాడు. మొదటిరోజుల్లో (అమ్మ లోకానికి వెల్లడి అయ్యే సమయంలో) అమ్మ దగ్గరకు వచ్చేవాళ్ళు కొంతమంది ఆమెను పరీక్షించాలని వేళకానివేళ అన్నం పెట్టమంటూ ఆమె దగ్గరకు వస్తే నిర్లిప్తంగా వాళ్ళను కూర్చోబెట్టి, తిరిగి వంటచేయటానికి వీలులేనంత త్వరగా యిద్దరికికూడా సరిపోకుండా ఉన్న అన్నంతో అందరికీ ఆకలితీర్చి "మీరు సరిగా తినలేదు. ఇంకా మిగిల్చారు" అంటూ ఆ గిన్నెలో అన్నం చూపిందట. అట్లానే సోదరులు శ్రీగోవిందరాజుల దత్తాత్రేయులుగారు ఒక పర్వదినాన జనులకు వడ్డన చేస్తూ "పాయసం అందరికీ సరిపోయేలా లేదమ్మా. వడ్డించనా ? మాననా ?" అని అడిగితే "ఫర్వాలేదులే. వడ్డించు" అన్నదట. కొద్దిమందికి మాత్రమే సరిపోతుందనుకున్న ఆ పాయసం అందరికీ వడ్డించినా యింకా చాలా మిగిలిందట! జబ్బులు నివారణ కావటం, బిడ్డలు

కలగటానికి వీలులేదని గొప్పవైద్యులు చెప్పినవారికి కూడా ఆమె దయవల్ల సంతానప్రాప్తి కలగటం ఎంత మామూలు విషయమో: జీసస్ లాగానే అమ్మకూడ తన ప్రతిభను నిగూఢం చేస్తుంది. "వాళ్ళ నమ్మకం గొప్పది. నాకేం తెలియదు" అంటుంది. క్రీస్తు కూడ తన వద్ద ఉపశాంతి పొందిన వాళ్ళను ఆ విషయం వెల్లడి చేయవద్దనేవాడు. కాని వాళ్ళు మానేవారు కాదు. ఇక్కడే కొంచెం తేడా. అమ్మ చెప్పవద్దంటే ఒక్కమాట కూడా వాళ్ళనోటి వెంట పెగిలిరాదు. మృతి పొంది పునః జీవించిన సంఘటనలు కొన్ని నా చెవిన పడ్డాయి.

అమ్మ లానే క్రీస్తు కూడా "మీ నమ్మకం మిమ్మల్ని బాగుచేసింది" అనే వాడు. అమ్మ తరచు రోగాలతో బాధపడుతున్న తన బిడ్డలను రక్షించటానికి ఆ బాధలను తను అనుభవిస్తుందంటారు. అన్నిటినీ కాదన్నట్లే అమ్మ దీన్నీ కాదంటారు. క్రీస్తు గురించి బైబిల్‌లో ఉంది "రోగులందర్నీ ఆయన బాగుచేశాడు. ఆయన గురించి ప్రవక్త ఏసయ్య 'మన బాధలను తను తీసుకుని మన రోగాలను తను భరించాడు' అని చెప్పినది నిజమయింది." (మాత్యూ 8:16 7) అయితే అటు క్రీస్తు యిటు అమ్మ యిద్దరూ కూడా ఒకప్పుడు వారు అనుభవించటంతో యితరులకు ఉపశమనం కలిగించటం, మరొకప్పుడు వారు అనుభవించకుండానే ఉపశమనం కలిగించటం కూడా ఉంది.

"వాన వస్తే?" అని అడిగిందట అమ్మ నవ్వుతూ.

"ఆకాశం శుద్ధంగా ఉన్నది. వాన ఏట్లా వస్తుంది?" అన్నారు వాళ్ళు,

"అట్లాగా?" అని పళ్లెం క్రింద పెట్టి రెండు చేతులూ పైకెత్తి "రావే, వానా. రా" అని పిలిచింది. వెంటనే ఏ మూల నుంచో అతి చిన్న మేఘం వచ్చి సరిగ్గా నడినెత్తిన ఆగి గబగబా వాన కురిపిస్తే వాళ్ళంతా వరండాలోకి పరుగెత్తారట. అమ్మ పకపకా నవ్వుతూ వాళ్ళ వెంటనే వచ్చి "చెప్తే విన్నారూ" అని మందలిస్తూ ముద్దలు పెట్టింది.

ఇటువంటి మహత్యాల గురించి అమ్మను నేనొకసారి అడిగాను

"అమ్మా నీ వల్ల జరిగే మహత్యాలను నీవు చేసినట్లు అంగీకరించవెందుకని? అట్లా చేస్తే మాకు నమ్మకం భక్తీ బాగా వృద్ధి పొంది మేము బాగుపడతాం కదా ?" అని.

"సరైన నమ్మకం ఎప్పుడూ అట్లాంటి వాటివల్ల కలుగదు. వాటి ననుసరించి ఏర్పడ్డ నమ్మకం అట్లా జరగని మరుక్షణం సడలి పోతుంది. సరైన నమ్మకం ప్రేమలా నిర్హేతుకంగా ఏర్పడుతుంది. తరుణం వచ్చినప్పుడు, అంటే నీ కేర్పడడం అవసరమని నా కనిపించినప్పుడు" అన్నది అమ్మ.

తాత్కాలికంగా కేవలం నన్ను నోరు మూయించటం కోసం ఆ సమాధానం యిచ్చింది. అనుకున్నాను గానీ అందులోని నిజాన్ని గుర్తించలేదు. తర్వాత బైబిల్ చదివితే అర్థమయింది. క్రీస్తు ప్రదర్శించిన మహత్యాలను చూచి కూడా నమ్మలేని వారనేకులున్నారు. అట్లానే అమ్మ వల్ల ఏ వింత అనుభూతి లేకుండానే సంపూర్ణంగా ఆమెను నమ్ముకున్నవారూ ఉన్నారు. జీసస్ కూడా తనను సులువుగా విశ్వసించలేని థామస్‌తో అన్నాడు. "థామస్! నీవు నన్ను చూచావు గనుక నమ్మావు. (కాని) నన్ను చూడకనే నన్ను నమ్మినవారు ధన్యులు."

ఇక వీళ్ళద్దరి ప్రవచనాల్లో సారూప్యం మరీ కొట్ట వచ్చినట్లు కనబడుతుంది. సెంట్ మేథ్యూ వ్రాసిన క్రీస్తు చరిత్రలో అయిదవ ప్రకరణంలో క్రీస్తు ప్రవచనాలు వ్రాయబడ్డాయి. వాటిల్లో చాలావాటికి అమ్మ సూక్తులు పోలి ఉంటాయి.

ఉదాహరణకు

క్రీస్తు : పవిత్రత కోసం ఆకలి దప్పికలకు వలే పరితపించువారు ధన్యులు. వారు సంపూర్ణులుగా చెయ్యబడతారు (6)

అమ్మ : **ముముక్షుత్వమే మోక్షం.**

క్రీస్తు : నా కోసం మీరు యితరులచేత దూషింపబడి హింసించబడితే అదృష్టవంతులు (11)

ఇదివరకు ప్రవక్తలందరూ అల్లా బాధలుపడినవారే (12)

అమ్మ : సహనమనే దేవత [illegible] పూజా ద్రవ్యాలు కావాలి. [illegible] మేలు.

క్రీస్తు : "హింస చేయరాదు, హింస ఎవరు చేస్తారో వారు అనుభవిస్తా" రని చెప్పటం మీరు విని ఉన్నారు. (21) కాని నేను అంటాను "ఎవడు తన సోదరుడి మీద అనవసరంగా కోపిస్తాడో వాడు అనుభవిస్తాడు" (22)

అమ్మా : **సహించరానిదే హింస, హింస అంటే చంపడమే కాదు. భరించరానిదే బాధ.**

క్రీస్తు : అన్యస్త్రీ సంపర్కమే కాదు దుశ్శీలమంటే (27) చెడు భావంతో ఒకస్త్రీని చూడడం కూడా దుశ్శీలమే అంటాను. (28)

అమ్మ : **బ్రహ్మ చర్యం అంటే కేవలం పెళ్ళి చేసుకోకుండా ఉండటమేకాదు. రూప, స్పర్శ, లింగభేదము లేకుండా ఉండటమే.**

ఇట్లా పోలుస్తూపోతే అంతులేని సామ్యం కనబడుతుంది. అయితే యీ యిద్దరిలో ఎవరు సంపూర్ణులని నిర్ణయించ ప్రయత్నించటం వ్యర్థం. అది కేవలం మన కొలత బద్ధ అయిన మన మనస్సును బట్టి అర్థమవుతుంది కాని యదార్థం తేలదు. రెండూ ఒక్కటేనన్న భావంతో మ్రొక్కటం మంచిది.

## 11. అమ్మ మాటల్లో అనుగ్రహం

"ఎవరికి తెలుసో వాళ్ళు మాట్లాడరు: ఎవరు మాట్లాడుతారో వారికి తెలియదు" అని ఒక ప్రాచీన ఋషి వాక్యం. అమ్మ ఏమీ బోధించదు. ఆమె గురువు కాదు. తల్లి కదా మరి **"బిడ్డ శ్రేయస్సుకై ఈ విధంగా చేయమని ఎవరూ కోరకుండానే బిడ్డకి అవసరమైంది తెలిసి చేసేదే తల్లి"** అంటుంది అమ్మ.

తన దర్శనార్థం వచ్చేవారిని ఆనుగ్రహిస్తుందా ? అన్న ప్రశ్నకు లేదనే సమాధానం చెప్పుకోవాలి. ఎవరైనా అనుగ్రహించమని వేడినప్పుడు అమ్మ **"అనుగ్రహం ఎప్పుడూ ఉన్నది. ఎవరో అడిగినప్పుడు యిచ్చేది కాదది. మనం సుఖసంతోషాలు ఎట్లా అనుగ్రహం వలన కలుగుతున్నయ్యని అనుకుంటూ ఉన్నామో పొందే కష్టాలు కూడా దానివల్లనే. అనుగ్రహమన్నది ఎప్పుడూ ఉన్నది. కొన్ని సమయాల్లో మాత్రమే మనం దాన్ని గుర్తిస్తాము. ఆ గుర్తింపు కూడా ఆ అనుగ్రహం ఉన్నదనిపించిన తీరు తెన్నుల్నిబట్టి. మరికొన్ని సమయాల్లో మనం దాన్ని గుర్తించలేము. గుర్తించనంత మాత్రాన అనుగ్రహం లేకుండాపోదు."** ఈ రకంగా సమాధానం చెప్తుంది. కనీసం నే నట్లా అర్థం చేసుకున్నాను అమ్మ మాటల్ని.

రమణమహర్షి ఏమన్నారో చూడండి "పరమేశ్వరుడే అనంతమైన అనుగ్రహం; అటువంటి అప్పుడు ప్రత్యేకించి అనుగ్రహించటం అనే క్రియకు తావులేదు. ఎల్లప్పుడూ

అనుగ్రహం ఉంటూనే ఉంటే ప్రత్యేకించి ఒక సమయంలోనో, ఒక సందర్భంలోనో అనుగ్రహం కలగటం అంటూ పొసగదు.

భగవంతుడు, అనుగ్రహము, గురువు అనే మూడు మాటలూ పర్యాయపదాలే. అవి శాశ్వతమూ, అవశ్యమూ అయినవి. అంతర్గతంగా ఆత్మ ఎప్పుడూ లేదా ? అనుగ్రహ వీక్షణవల్లనే గురువు ఆత్మను ప్రసాదిస్తాడా? ఏ గురువయినా అలా భావిస్తున్నట్లయితే, ఆ పేరుకుకూడా అతడర్హుడుకాదు."

ప్రారబ్ధవశంగా మనం అన్ని పనులూ చేస్తుంటామనీ, అనుగ్రహమనేది వీటికి అతీతమైందనీ, అనుగ్రహాన్ని సాధన చేసి పొందవలసిందేననీ మనలో ఒక అభిప్రాయం గాఢంగా పాతుకుపోయింది. అందుకనే "మనం పనిచేద్దాం ఆపైన మిగిలింది భగవంతుడికి వదిలేద్దాం" అని మనం తరచు అనుకుంటూ ఉంటాం. మనం కృత కృత్యులమైతే "అంతా 'వాడి' "అనుగ్రహం" అంటాం. లేకపోతే అదృష్టం లేదండీ - వాడి దయలేదు" అంటాం. అంటే భగవదనుగ్రహం కోసం ప్రతినలు పూనటం, ప్రార్థనలు చేయటం లాంటి ప్రయత్నాలన్నీ చేస్తాం. మనకు తెలియకుండానే పరమేశ్వరుని ఒక స్తోత్రప్రియునిగా లంచగొండిగా దిగజారుస్తున్నా మన్నమాట! మన ఓటమిలో భగవదనుగ్రహాన్ని చవిచూడలేకపోయేసరికి ప్రార్థించినందుకే విచారించే స్థితికి వస్తాం. లేకపోతే ఒక కోరిక కోసం ప్రార్థించనే ప్రార్థించము. మనం ప్రార్థించేటప్పుడు మనం నిజంగా ప్రేమించేది. జాగ్రత వహించేది, మనకోరికలు తీరటాన్నే అన్న విషయం మనం అంగీకరిస్తాం. భగవంతుడు మన కోర్కెలు తీరటానికి ఒక ఉపకరణం అవుతున్నాడు. నిరంతరం ఓటమినే ఎదుర్కొన వలసి వచ్చినప్పుడు, అంతులేని బాధలకు గురియైనప్పుడు మాత్రమే మనం శ్రద్ధాసక్తులతో ఈ బ్రహ్మపదార్థాన్ని గురించి ఆలోచిస్తాం. సర్వదా ఉన్న భగవదనుగ్రహం ఆ క్షణంలో మాత్రమే మనకు అనుభవ మౌతోందన్నమాట. "లోనున్న అనుగ్రహ ప్రభావమే మనల్ని అనుగ్రహం కోసం పరితపించే వాళ్ళనుగా చేస్తోంది అన్నారు రమణ. పురుష ప్రయత్నం, భగవంతుడు, భగవదనుగ్రహాల గూర్చి మనం తీవ్రంగా సత్యాన్వేషణం చేయదలచినప్పుడే నిజంగా మనం అజ్ఞానమనే భ్రమ తొలగాలని పరితపిస్తున్నామన్నమాట. మాయ తొలగవలెనని ఆత్మ కోరుకున్నప్పుడే మాయ తొలుగుతున్నది. అందుకే **"ముముక్షుత్వమే మోక్షం"** అన్నది అమ్మ.

**"భగవదనుగ్రహం కాదు - అనుగ్రహమే భగవంతుడు"** అంటుంది అమ్మ. సర్వాన్నీ నియమితం చేసిన ఒక శక్తి ఒకానొకనికి మోక్షప్రాప్తికి తరుణం కూడా నిర్ణయిస్తుంది. ఆ **"తరుణమే భగవంతుడు."** అజ్ఞానవశులమైన మనం దేన్ని అనుగ్రహంగా భావిస్తామో దాన్ని గుర్తించే తరుణం కూడా సర్వసృష్టి నియమిత మయినప్పుడే నిర్ణయింపబడింది. అనుగ్రహంవలన నిర్ణీతమయిన సృష్టిక్రమాన్ని దాని ఆవిష్కరణాన్ని అనుగ్రహమే నిర్ణయించింది. మనకు మాత్రం అనుగ్రహాన్ని గుర్తించిన తరుణమే అనుగ్రహమవుతున్నది. ఇది ప్రయత్నపూర్వకంగా సంభవించేదేమీకాదు. ప్రయత్నం వల్ల ఫలించింది బహూకృతి అవుతుంది గాని అనుగ్రహం కాదు. అందుకే "దాన ధర్మాలవల్లగానీ తీవ్ర తపోయోగసాధనా ఫలంగాగాని విశ్వరూప సందర్శన భాగ్యం కలగదు" అని కృష్ణపరమాత్మ చెప్పారు (గీత12-48).

అర్హతానర్హతల ప్రమేయం లేకుండానే అనుగ్రహం ఆవిష్కరిస్తూ వుంటుంది. క్రీస్తు అన్నారు **"భగవంతుడు తప్ప మంచితనం అంటూలేదని అందుకే అమ్మ "గుణభేదమే లేని నాకు కులభేదమేమి"టనీ, "విచక్షణ లేని వీక్షణే అనుగ్రహ"**మనీ అన్నది. శిశువు కోరిన ప్రతిదీ తల్లి పెట్టదు. శిశువు కవసరమైన దేదో దానినే తల్లి పెట్టుంది. మనకు అనుగ్రహింపబడింది మనం కోరుకున్నది కానప్పుడు దాన్ని అజ్ఞానవశులమై అనుగ్రహంగా గుర్తించలేము. మన అజ్ఞానమే మళ్ళీ కోరుకున్నది జరిగినప్పుడు అనుగ్రహింపబడినట్లు భావించేందుకు కారణమౌతుంది.

"అమ్మా ! అనుగ్రహం అంటే ఏమిటి ?" అని అంటే "ఏది అనుగ్రహం కాదో చెప్పు ?" అని ఎదురు ప్రశ్నవేసింది అమ్మ.

అమ్మ మాటల్లో "అనుగ్రహం" అట్లా వుంటుంది. అమ్మ బోధించటంలోని విన్యాసమది - సర్వాన్నీ బోధించకుండానే బోధపరుస్తుంది.

బాధపడని గుణం ఎలాగ వస్తుందమ్మా ?

బాధ అని నువ్వనుకునే దాన్ని చేసిన వాడిస్తేనూ.

ఇచ్చేవాడు ఒక్కడే అయి అందరికీ వేర్వేరు అనుభవాలు ఇచ్చాడేమమ్మా?

నాటకకర్త అన్ని పాత్రలకీ ఒకలాటి అనుభవమే ఇస్తాడా నాన్నా ?

ఇక్కడ నాటకం ఎవరికోసమమ్మా ?

రాసింది తనకోసమే ఆడించేది తన కోసమే. ఆడేది తానే, ప్రేక్షకులు తానే, అన్నీ తానే. రాసేవాడికీ ఒకటేగాని అనుభవించేవారిలో వేరులు వల్ల ఒకరి పాత్ర ఇంకొకరికి బాధగా వుంటుంది.

నొప్పి ఎవరమ్మా ?

అదీ తనే. నొప్పీ సంతోషమూ; తృష్ణా తృప్తీ; మంచీ చెడ్డా; అన్నీ తనే; అన్నింటికీ తానే ఆధారము.

## 12. నా స్మృతిపథంలో .... హైమ

తిథుల ప్రకారం 11 నవంబరు 1964 హైమ 25వ జన్మదినం. జీవించి ఉన్నట్లయితే 25 సంవత్సరాల వయసు నధిగమించి దివ్యమానవిగా వికసించి, గుర్తింపబడి పరిపూర్ణమైన జీవితం గడిపి ఉండేది; ప్రాయశః వివాహం జరిగి ఉండేది. ఏ పూర్ణత్వం అమ్మగా ఉన్నదో అదే పరిపూర్ణత్వము అనేక అవతారాలుగా ఆవిర్భవించి అమ్మ తరువాత ఒక పరంపరగా మనకు దక్కి ఉండేది. హైమ క్షేమంగా 25 సంవత్సరాల వయస్సు దాటినప్పుడే 'దాని' వివాహ విషయం ఆలోచించవచ్చనీ. అప్పుడే హైమ ఆరోగ్యంగాను ఆధ్యాత్మిక జీవనంలో అమోఘంగాను ఉంటుందనీ హైమ జీవించి ఉన్నప్పుడే అమ్మ చెపుతూండేది. వింట సంధించిన బాణాన్ని చిరంతనమైన ప్రగాఢ నిశ్శబ్దంలోకి లాగి విడచినపుడు తెగిపోయి మెలికలు పడిన వింటి త్రాటి మోతను మాత్రమే మనమిప్పుడు వినగలం. వసంతకాలంలోని నిర్మలమూ మేఘాచ్ఛాదితమూ అయిన సుప్రభాతపుటాకాశంలో మాత్రమే హైమ యొక్క అమలినమూ అపారమూ అయిన ప్రేమనీ, చిక్కని ఆపేక్షనూ, ఆమె మనస్సులో మలయమారుతపు స్వచ్ఛందతనీ చూడగలం.

నా కనిపిస్తుంది – దాదాపు అందరికీ హైమ హైమాలయంవలెనే ఉంటుందని. అదృశ్యమూ, అగమ్యమూ, వరదాయినీ అయిన దేవత ఆమె. నాకో గొంతునుండి బయటకి అతిబాధతో రా ప్రయత్నిస్తున్న గడ్డకట్టిన విషాద మామె – నా కనుకొలకుల్లో అతికష్టం మీద యింకిపోయిన రెండు కన్నీటి బిందువులు, అమ్మతో సహ యిక్కడున్న సర్వానికీ నాకూ మధ్యగల దూరమామె. నా జీవితరథం వేగంగా పయనించి చేరుకోదలచిన గమ్యం ఆమె. ఎవ్వరూ ఏదీ పూరింపలేని అగాధమామె. అత్యంత

బాధాకరమైన ఆక్రందన కూడా చెదరగొట్టలేని భయంకరమైన నిశ్శబ్దమామె. అమ్మ సాన్నిధ్యంలో నే నుండటంలోని విలక్షణమైన సంతోషం ఆమె. హైమ అత్యంతము ప్రేమించి లాలించిన ఆటవస్తువుని నేను. చాలామందివద్ద నేను పొందలేక పోయినట్లున్న అవగాహనే హైమ. పదిమందిలో తరచు చెప్పుకోలేని పవిత్ర స్మృతి ఆమె.

నాలుగున్నర సంవత్సరాల క్రితం 1964 వ సంవత్సరం మే 3వ తారీఖున జిల్లెళ్ళమూడిలో నా స్నేహితుడితో పాటు డాబాపైన కూర్చుని ఉన్నాను. జిల్లెళ్ళమూడిలో నేనున్నందువల్ల పొందిన పారమార్థిక పరిణామాన్ని అంచనా వేయటానికి ప్రయత్నిస్తున్నాను. అది నా కంత గణనీయంగా కనపడలేదు. ఎందుకంటే నేను గమనించగలిగిన ఆధ్యాత్మికానుభవం నాకు కలగలేదు. నా ఉనికిలో నేను లీలగా అనుభవిస్తున్న ప్రగాఢమైన మనశ్శాంతికూడా నాకు రూఢిగా లేదు. ఎక్కువకాలం నేనిక్కడ గడపాలని మాత్రమే ఉంది గాని నా పాదాలు నిలువదొక్కుకునేందుకు ఆధారం నాకు లేదు. పారమార్థికంగా ఒక సన్నిహిత పరిచయం ఏర్పరచుకోలేని, యితమిత్థమని చెప్పలేని అభయప్రదమైన పూజ్య భావమే 'అమ్మ' నాకు. అందమైన నా జీవన నందనంలోని అమ్మ సన్నిధిలోని ఆధ్యాత్మికానుభూతి మిణుకు మిణుకుమనే నక్షత్ర కాంతివంటిదే. అమ్మ చెపుతున్న అనేకమయిన సంగతులు నాకు పూర్తిగా తెలియనివి కావు. అమ్మ మాటలతో నా గతజీవితంలో నా కేర్పడిన అభిప్రాయాలు ధృవీకరింపబడటం మాత్రం గమనించాను.

ఈ విధంగా చీకటిపడేవరకూ నేను ఆలోచిస్తున్న సమయంలో ఒకానొక చెల్లెలు హైమను వెంటబెట్టుకొని వచ్చి నాకు పరిచయం చేసింది. తన వయస్సు కన్న చిన్నదిగా, అవిచ్ఛిన్నమైన పెరుగుదల లేని సుకుమారమైన ముచ్చటగొలిపే బాలికలా ఉన్నది. నా ముందు కూర్చుంటూ 'నమస్తే' అన్నది. ఆమె కమనీయ స్వరంలో గాఢమైన మమతా స్వభావమూ, అమాయకత్వమూ వెల్లడయినాయి. వర్తమానకాలంలో అరుదై పోయిన ఆ సంబోధన చూచి, జంకుతోనే తిరిగి నమస్కరించాను. కుశల ప్రశ్నాదికమయిన తర్వాత పరస్పరాభివందనలతో విడిపోయాం.

మర్నాడు హైమ వరండాలో కూర్చుని ఉండగా చూశాను. ప్రసంగవశాన తన ఆరోగ్యం గురించి దీర్ఘమూ గుణరహితమూ అయిన వైద్య విధానం గురించి

చెప్పింది. ఆ కాలంలో ప్రకృతి చికిత్స చేయించుకొంటున్నానని అందులోనే కొంత గుణం కనపడిందని చెప్పింది. తర్వాత అప్పుడప్పుడు నా కోసం కబురు చేస్తూండేది. నేను వెళ్ళి కూర్చున్నప్పుడు నన్ను గురించి విచారంగాను నాపై ఆపేక్షతోను చూపులు సారిస్తూ నాచే మాట్లాడించాలనే ప్రయత్నం చేసేది. కానీ స్వభావతః ఎక్కువ మాట్లాడేతత్వం నాకు లేనందువల్ల మా సమావేశాలు ముభావంగానే ఉండేవి. అయినప్పటికి ఆమెకు నానుండి దూరంగా ఉండాలనిపించేది కాదు.

ఒకనాటి సాయంకాలం నేను యిసుక దిబ్బమీద ఒంటరిగా కూర్చుని ఉన్నాను. గడ్డం పెరిగిపోయి జుట్టు చెదిరిపోయి ఉంది. పైన చొక్క బనీను వేసుకోకుండా ఒక టవలు మాత్రమే భుజాలపై వేసుకుని ఉన్నాను, హైమ నెమ్మదిగా రెండుసార్లు నా ముందు నుంచి ప్రశ్నార్ధకంగా చూస్తూ అటు యిటు పచార్లు చేసింది. చివరికి దాబాపైకి రావలసిందిగా నా కోసం కబురుచేసింది. నేను చేరేసరికి ఒంటరిగా కంటనీరు పెడుతూ కనపడింది.

"కూర్చో" కొద్ది నిమిషాల ప్రయత్నం మీద తన విచారాన్ని అణచుకొని అడిగింది " మీ అమ్మ ఎప్పుడు పోయింది ? నీ కప్పుడు ఎన్నేళ్ళు ?"

"1942 లో పోయింది. నాకు నాలుగేళ్ళు కూడా లేవప్పటికి."

"నీ కావిడ బాగా గుర్తుందీ ? అమ్మలేని లోటు చాలా ఉంది గదూ?"

ఈ ప్రశ్నలు వేసేసరికి మళ్ళీ పెల్లుబికే దుఃఖం ఆపుకోలేక ముఖం ప్రక్కకు తిప్పుకుని నా సమాధానాల కెదురు చూచింది.

"నిజమే. ఏవో కొన్ని సంఘటనలు మాత్రమే నా మనస్సు మీద చెరగని ముద్ర వేసినాయి. వీటిని తప్పించి నాకేం గుర్తు లేదు. ఆమె కోసం ఎప్పుడూ ఏడ్వలేదు. నన్ను పూర్తిగా అర్థం చేసుకోగలిగిన వ్యక్తి మళ్ళీ కనపడదు అని మాత్రం అనిపిస్తూండేది. జీవితంలో ఏం జరుగుతున్నా ఆనందం కనపడని క్షణాల్లో అలా అనిపిస్తుంది. పరీక్షల్లో ప్యాసయినప్పుడు గాని, ఉద్యోగం సంపాదించినప్పుడు గాని, యితర రంగాల్లో విజయం కలిగినప్పుడు గాని నాకేం అనిపించలేదు. వాన కురుస్తున్నట్లు సూర్యోదయాస్తమయాల్లాగ సహజంగా కనిపించింది. నేను ఎవరితోను బాంధవ్యం (attachment) భావించను. నాయందు చూపించే ప్రేమానురాగాలని నే నర్థం చేసుకోగలనని కూడా నే ననుకోను."

"ఇదంతా - యింకా నీవు చెప్పగలిగిందంతా నీ కళ్ళే చెప్తున్నాయి బాబూ!" అశ్రువులు జాలువారుతుండగా అన్నది హైమ. "నిర్లక్ష్యం చేయబడ్డ బిడ్డగా. ఊహించలేనంత పసివాడివిగా కనబడతావు. నువ్వు ఏకాకివైనట్లుగా కూడ కనబడతావు. నిన్ను చూచినప్పుడల్లా నా కన్నీరు ఆపుకోలేకపోతున్నాను. ఆ ముఖం చూచినాక విచారం నా హృదయాన్ని తరుముతున్నది. నీ యింటిలో ఉన్నట్లు నిన్నుంచేందుకు ఏమయినా చేయాలని తప్పనిసరిగా తోస్తున్నది నాకు. నేనే నీ అమ్మనై హృదయానికి హత్తుకోవాలనీ. ఆ కళ్ళలో కనబడే విచారాన్నీ ఒంటరితనాన్నీ పోగొట్టాలనీ కోరుకుంటుంటాను. నిజం బాబూ ! నే నట్లా నిన్ను పిలవకుండా ఉండలేను. నేను నీ అమ్మనై తల్లి తన మూడేండ్ల బిడ్డకి ఎలాంటి సేవ చేస్తుందో అంతా నేనే చేయాలనీ - నీళ్ళు పోయటం, అన్నం పెట్టటం, తలదువ్వటం, ఒడిలో పడుకోబెట్టుకొని నిద్రపుచ్చుటం - నేనేం చేయాలనుకుంటున్నావో అవన్నీ చెప్పలేను. నా అవివేకానికి నువ్వు నవ్వుతావు గాని అది మాత్రం యదార్థం."

ఈ మాటలు పూర్తి చేస్తూనే చేతుల్లో ముఖందాచుకుని బావురమని విలపించింది. నా హృదయంలోని గుప్తమయిన బాధని స్పృశించిన ఆమె మాటలకి నేను నివ్వెరబోయి మూగవోయాను. మా మధ్య ఎంతో నిశ్శబ్దం ఆవరించింది. అతి బలవంతం మీద క్షమాపణన్నా చెప్పగలిగాను.

"నన్ను క్షమించు హైమా ! నీ ఎదుటిబడి నీ హృదయాన్ని కల్లోల పరచాను."

మరుక్షణమే తన చేతిని నా నోటికి అడ్డుపెడుతూ "అట్లా ఎప్పుడూ అనకు బాబూ ! అట్లా అని నన్నింకా నిస్సహాయురాల్ని చేస్తావు - యింకా గాయపరుస్తావు. ఈ భావం నుండి నే నెప్పుడూ తప్పించుకోలేనని నాకు తెలుసు. నీకు ఋణపడి ఉన్నా ననుకుంటాను. నీ సుఖసౌకర్యాలు చూచి పెట్టవలసిన బాధ్యత నాదను కుంటాను. ఒంటరిగా ఎప్పుడూ కూర్చోకు బాబూ ! అమ్మ దగ్గర కూర్చున్న సమయంలో తప్ప, మిగతా సమయాల్లో ఎప్పుడూ నా దగ్గరే కూర్చో. నా గదిలో నీ సంచిపెట్టుకో. నీ ధ్యానానికి ప్రార్థనలకి ఎవరూ అడ్డంరారు" అన్నది.

"నిజంగా చెపుతున్నా. నాకు ఎవరూ ఓదార్చాలని అనిపించదు. నాకున్న దాంతోనే నేను సంతోషంగా ఉన్నా. నువ్వు అనే ఒంటరితనంలోనే నేను దృఢంగా ఉన్నట్లు భావిస్తాను. స్వభావతః నే,నిటువంటివాణ్ణి. ఉద్రేక స్వభావం కాదు నాది.

నా గురించి నా పరిస్థితిని చూచి నువ్వు దుఃఖాన్ని పెంచుకుంటున్నావేమోననీ. నాపై మమకారాన్ని చూపుతున్నావేమోననీ, నాకు భయంగా ఉంది. నీ స్వభావం స్వల్ప వ్యవధిలోనే గట్టి సాన్నిహిత్యాన్ని పెంపొందించుకునేట్లు నేను భయపడుతున్నాను. నే నీ ప్రదేశం విడిచివెళ్లిన క్షణం నాగురించి మరింత ఒంటరితనం అనుభవించేట్లున్నా. నేనా - యిక్కడికి తరచుగా వస్తానన్న నమ్మకం నాకు లేదు. మన ఈ సాహచర్యం వల్ల, వేరైన మన స్వభావాల వల్ల నువ్వు సంతోషపడగలవని నే ననుకోను. నీకు నా యెడ కలుగుతున్న మమతను అదుపులో పెట్టుకో. నీ మనస్సును దానిని ఊహించు కోనీయకు. నా కోసం ఎవరన్నా బాధపడుతుంటే నేను నిలవ లేను. చిక్కుపడిపోతాను. నేను నిజంగా చెపుతున్నానమ్మా! నేనేం ఒంటరితనంవలన బాధపడటం లేదు. ఎవరూ ఓదార్చే అవసరమూ లేదు. ఎంతోమంది అన్నయ్యలు నీ ఆపేక్షను పంచుకునేందు కున్నారు. పైగా అమ్మ ఉంది. నీకేం కావాలింతకన్న ? అమ్మ తన ఆధ్యాత్మిక వారసత్వానికి నిన్ను తయారు చేస్తోందేమో కూడా !"

"నువ్వట్లా అనకు. తమ చెల్లెలుగా నన్ను భావించే అన్నయ్య లెందరో ఉన్నారు. కాని వాళ్ళంతా నన్నట్లా ఎందుకు చూస్తారంటే, ఒకానొకనాడు నేను కూడా పరిపూర్ణత పొందుతానని. నాకున్న ఈ చదువుకి ఈ అనారోగ్యానికి ఇంకో తల్లి కడుపున పుట్టినట్లయితే వీ రెవరూ నన్ను లెక్కచేసేవాళ్ళు కాదు. ముందు నాకేం జరగనున్నదో నాకు తెలీదు కాని మీ అందరివలెనే నేనూ. నే నెంత చెప్పినా వాళ్లెవరూ వినరు బాబూ! ఇదంతా వినయమనీ, అబద్ధమాడుతున్నానీ నన్ను వెంటబడి "చిన్నమ్మా ! చిన్నమ్మా !" అంటుంటారు. తోటి చెల్లెలునే నని ఒప్పించేందుకు వీలుగా నా జీవితంలోని ఒడుదుడుకులూ, నా హృదయమూ వాళ్ళకి చెప్పే అవకాశం నాకు లేదు. నువ్వు నా జాగ్రత్త వహిస్తావని నాకు తెలుసు. కనీసం అమ్మగారికూతురు' గా మాత్రం నాతో వ్యవహరించవద్దు. నేను మీ అమ్మ లాటిదాన్ని. అట్లాగే నన్ను చూడు. నిన్ను నా బాబులాగా పెంచుకోవటం నీకు కాకపోయినా, నా అవసరం. ఆ ఆలోచనవస్తే చాలు నా హృదయంలో ఒంటరితనం, విచారస్మృతులు దూరమై పోతాయి. నిన్ను చూచిన నాటినుంచి నీపై మమత పెరుగుతూనే ఉంది. నీతో మాటాడకముందే నిన్ను నే చూశాను. నీ గురించిన ఆలోచనలు అదుపులో పెట్టటం నాకు మాత్రం సాధ్యం కాదు."

ఎవరో హైమకు కబురు పంపారు. వెళ్ళవలసి వచ్చింది. నా సత్యాన్వేషణపై మసక చీకట్లు కమ్ముతాయేమోనన్న భయం నన్నావరించింది. రెండురోజులు

ఉద్దేశ్యపూర్వకంగానే హైమను తప్పించుకు తిరిగి ప్రయాణానికి సిద్ధమౌతున్నా. అక్కడికి వచ్చిన హైమ ఉన్నపళంగా అన్నది.

"నే నొకటి అడుగుతాను. చేస్తావా ? నువు సరేనంటే చెప్తా'

"సరే – అలాగే – ఏమిటిది ?"

"ఆ – అదుగో – నువ్వు సరేనన్నావు. అయితే నీ వేసవి సెలవలయిపోయే వరకు యిక్కడే ఉండిపో."

నేనుంటానన్నందువల్ల తను పొందిన సంతోషం ముఖంలో వచ్చినట్లు కనపడటంతో, నాలుగైదు రోజుల్లో ఏదో మిష మీద ఆమె అంగీకారం తీసుకు వెళ్ళవచ్చని తలపంకించాను. నా సంచిని తన గదికి మార్చింది. నా గురించిన అన్ని జాగ్రత్తలూ తీసుకుంది. నేను హైమ గదికి వచ్చాను. అపరిమితానందంతో తెలిసిన ప్రతివారికీ తన కొడుకు గురించి చెపుతూ నన్ను చూపిస్తూ వచ్చేసరికి అందరికి హైమ కుమారుడిగా తెలిసిపోయాను. అమ్మ సన్నిధిలో లేని ప్రతిక్షణమూ హైమ వద్దనే గడిపాను. నా యందలి ఆపేక్షను నిరవధికంగా నాపై క్రుమ్మరించింది. తన జీవితంలో ఎవరికీ చెప్పలేని చికాకు కలిగిస్తూన్న స్వల్ప విషయాలను నాలో భద్రం చేసింది. ఈ స్వల్పమైన చికాకుల నెంత తీవ్రంగా, భయంకరంగా తాను చూచిందో చూచి ఆమె మనస్సు ఎంత సున్నితమో పవిత్రమో తెలుసుకోగలిగాను. సెలవులయిపోయాక నేను వెళుతూన్నప్పుడు. అమ్మను చూడాలని నా కనిపించకపోయినా నా తల్లిని (తనను) చూడటానికైనా తరచుగా రమ్మని చెప్పింది.

మూడు సంవత్సరాల పాటు జిల్లెళ్ళమూడి సెలవులలో మత్రమే కాకుండా కనీసం నెలకు మూడుసార్లయినా వెళ్తూండేవాడ్ని. నా తల్లితో కలసి ఉండటానికి. మేం కలిసి ధ్యానం చేసేవాళ్ళం. గొప్ప ఋషుల జీవిత చరిత్రలు. శ్రుతిస్మృతులు. మహర్షుల బోధలూ చదువుతూండే వాళ్ళం. తన బాల్యంలో అమ్మను గురించిన తన పరిశీలన వివరించేది. నేను నే చూచిన పుణ్యపురుషుల గురించి, పవిత్ర స్థలాల గురించి చెప్పేవాడిని. నేను యిక్కడికి చాలా పూర్వమే వచ్చి ఉండవలసిందని, వచ్చివుంటే తన పారమార్థిక పథంలో ప్రోత్సహింపబడి తానెదుర్కొన్న చికాకు పరిస్థితులు లేకుండా ఉండేవని, యిప్పటికయినా అమ్మ నన్ను తనకు ప్రత్యేకమయిన కానుకగా యిచ్చి అనుగ్రహించిందని చెప్పేది. ఆమె సాన్నిధ్యంలో నేను మళ్ళీ నా యింట్లో శైశవాన్ని, బాల్యాన్ని గడుపుతున్నట్లుండేది. ఆమె లేనప్పుడూ –

ఉన్నంతకాకపోయినా - జిల్లెళ్ళమూడిలో అమ్మ చరణసీమలో ఉన్న పారమార్థికాన్వేషిని. ఒకానొకనాడు అమ్మ నాకు సచ్చిదానందాన్ని ప్రసాదించవచ్చు.

నే నివాళ యిక్కడుంటున్నానంటే, అమ్మ అనుగ్రహ ప్రభావాన్ని గుర్తించగలనన్న నా సామర్థ్యం వల్ల కాదు - హైమయే కారణం. బహుశః రెండూ ఒకటేనేమో! హైమ తుదిశ్వాస విడిచినాక అమ్మతోపాటు కారులో జిల్లెళ్ళమూడి నేను దూసుకు వస్తున్నప్పుడు "ఇకముందు నే నిక జిల్లెళ్ళమూడిలో ఉండను. నా తల్లి మరి లేదు. అమ్మ సర్వత్రా ఉన్నది. అమ్మ అనుగ్రహం కోసం నేను ప్రత్యక్షంగా ఉండనవసరం లేదు" అని ఆలోచించుకుంటున్నాను.

అమ్మ తన తలయెత్తి భాషకందని విషాదస్వరంతో "నాన్నా ! ఉద్యోగం వదిలేసి దగ్గర ఉండవా ?" అని అడిగింది.

ఆ సూచనను నేను అతిత్వరితంగా ఆలోచిస్తున్నప్పుడే వెంటనే అమ్మ "నీలో హైమను చూసుకుంటాను. దాని ఆపేక్షకి ప్రియమైనవాడిని నువ్వు నీ జాగ్రత్త నేను తీసుకోవాలని తన చివరి మాటలుగా నాకు చెప్పింది" అన్నది.

అమ్మ అడిగినది కాదనటానికి నాకు మాటలు లేవు. కొన్ని నెలల తర్వాత కొందరు అమ్మ మాటలు నన్నిక్కడ అట్టి పెట్టడానికి ఉపయోగించినవే నన్నారు. ఆ రకంగా నాతో మాట్లాడినవారి సమక్షంలో అమ్మ "పత్రికకు వ్యాసాలు రాయాలని గాని యింకేదో పనికోసం గాని నిన్నిక్కడ నేను ఉండమన లేదు. నీలో హైమను చూస్తాను గనుక, హైమకు ప్రియమైన జాగ్రత్త తీసికోవటంలో నా కానందం గనుక నిన్ను ఉండమన్నాను" అన్నది.

అందుకే ఇక్కడ ఉన్నాను.

## 13. అమ్మ సద్గురువు కాదా ?

అమ్మ 'నేను సదుర్గువును కాను' అన్నారని విని అమ్మ అల్లా అని ఉండరని నాకు తోచి అమ్మను అడిగాను. అప్పుడు అమ్మ అన్నారు "నేను సద్గురువును కానని అనలేదు; గురువును కానని మాత్రమే అన్నాను. సద్గురు వంటే నా ఉద్దేశం దైవమనీ, దైవమని ఏదయితే అనబడుతుందో అదేననీ, నేను గురువును కాననప్పుడు నా భావం యీ నాడు సంఘంలో 'గురువు' అన్న పదం బహుతేలిక అయినదని."

అమ్మ అన్న యీ మాటలలో రెండు, మూడు విషయాలు సూచించబడ్డాయి. ఆమె సద్గురువనీ, దైవమనీ, ఆ రెండింటికీ భేదంలేదనీ, అందుకే అమ్మ అన్నారు

నాతో "సద్గురువుంటే గురుధ్యానంలో "గురుర్బ్రహ్మ" అని చెప్పబడ్డదే. అంతా గురుస్వరూపమే." అమ్మ అంటే అంతులేనిదీ, అద్దులేనిదీ ఆధారమైనది - అని అమ్మ యిచ్చిన నిర్వచనానికి "గురుర్బ్రహ్మ..." అన్న శ్లోకంలో 'గురువు'నకు నిర్వచనానికీ భేదంలేదు. తాను అమ్మనని చెప్పటంలో తానే సద్గురువునన్న భావం యిమిడి ఉన్నది. అమ్మను ప్రథమంలో దర్శించినవారు "అమ్మా - మీకు శిష్యులు ఉన్నారా ?" అని అడిగితే "నాకు శిష్యులు ఎవరూ లేరు నాయనా" అని అమ్మఅనటం విన్నాను. అమ్మ సద్గురువయితే శిష్యులు ఎందుకుండరూ ? అని ప్రశ్న రావచ్చును. సమాధానం - అమ్మ సద్గురువు కాబట్టి, గురువు కాదు కాబట్టి.

అమ్మ 'నేను సద్గురువును కాను' అని ఉండరని నాకు అనిపించటానికి కారణం చెప్పాలి. భగవాన్ రమణమహర్షిని ఒక భక్తుడు 'మీకు శిష్యులు ఎవరూ లేరా ? అని ప్రశ్నించినప్పుడు లేరు' అన్నారాయన. "మోక్షప్రాప్తికి సద్గురువు అవసరం అంటారు కదా?" "అవును" అన్నారు భగవాన్. "మరి మేమేమిచేయాలి ? ఇక్కడ నుంచి వెళ్ళి వేరే గురువుకోసం అన్వేషించాలా ? మేము యిక్కడ గడిపినకాలం వ్యర్థమేనా?" అంటే భగవాన్ చెప్పారు. "మిమ్ము యింతదూరం నుంచి యిక్కడకు తీసుకువచ్చి యింతకాలం యిక్కడ ఉంచినది ఏదనుకుంటున్నారు ? ఎందుకు మీకు సంశయం? మీరు వేరే గురువు వెదుక్కోవలసిన అవసరమే ఉంటే మీరు ఏనాడో వెళ్ళి ఉండేవారు." జ్ఞాని ఆ గురువు తనకూ యితరులకూ భేదం చూడడు. ఆయన దృష్టిలో అజ్ఞానులే ఉండరు. అందరిలోనూ పరిపూర్ణమయిన జ్ఞానాన్నే చూస్తాడు. అంటే తన రూపాలుగా చూస్తాడు. అందుకే ఆయన దృష్టిలో 'శిష్యులు' ఉండరు. సృష్టిని అనేకంగా చూచే శిష్యుల దృష్టిలోనే గురుశిష్య సంబంధానికి వాస్తవికత ఉంది.

సద్గురువుయొక్క లక్షణాల గురించి ఒకరు అడిగినప్పుడు మహర్షి యిలా చెప్పారు. "గురువూ, దైవమూ, కటాక్షమూ - అన్నవి నిజానికి పర్యాయపదాలు:" "గురువంటే నిరంతరం ఆత్మభావమందే ఉండేవారు. ఆయనకు తను జ్ఞానిని అనిగానీ, ముక్తుడను అనిగానీ, యితరులు అజ్ఞానులు అన్నభావం గానీ ఉండదు. ఎట్టి పరిస్థితుల్లోనూ చెదరని ఆత్మభావం కలవాడు. "గురువు లోపలా, బయటా కూడా ఉన్నాడు." మనస్సును అంతర్ముఖం గావించటానికి అవసరమయిన పరిస్థితులు కల్పించి తరుణం వచ్చినప్పుడు స్థూలరూపంలో దర్శనమిచ్చి, అంతర్ముఖమయిన మనసును హృదయంలో ఉన్న తనే వైపు లాక్కుంటాడు. ఈ హృదయంలో ఉన్న

గురువును అమ్మ గుర్తు అంటారు. ("గు –గురువు") అంటే చైతన్యరూపుడయిన గురువు సర్వజీవుల హృదయాలలో ఒక్కడే నిలిచి వాటి శరీరాలను, మనసులను ప్రేరేపించి గుర్తింప జేస్తారు. కాబట్టి ఆ గుర్తించే గుర్తింపే గురువనీ; యీ విషయాన్ని బాహ్యంగా గురురూపంగా తెలియ జెప్పేవాడు సద్గురువనీ; యిలా బాహ్యంగా దర్శనమిచ్చి చిరస్థాయిగా తన స్వరూపాన్ని శిష్యుని హృదయంలో ముద్రవేసి గుర్తుగా నిలిచిపోవటం అని కూడా అందులో స్ఫురణ ఉంది.

ఒకసారి అమ్మ అన్నారు "గుర్తుతో గుర్తించి గుర్తు నశించాలి" అని అంటే ఎప్పుడూ లోపల ఉండి అన్నింటినీ గుర్తింపజేసే గుర్తు యందే మనస్సు లగ్నం చేసి గుర్తు ఉంచుకుంటే కొంతకాలానికి గుర్తేతాను తానే గుర్తు వేరుగా ఉండక నశిస్తుంది. అంటే హృదయంలో గుర్తుగా ఉంటే గురువును ధ్యానించడం ద్వారా తానే ఆ గుర్తు అయి తను దేహమన్న అజ్ఞానం నశిస్తుందని తాత్పర్యం. ఇదే మహర్షి చెప్పిన "నేనెవరు?" అన్న ఆత్మవిచారమార్గసారం.

అమ్మ గురువునకూ, సద్గురువునకూ భేదం చెప్తూ సామాన్యంగా ప్రపంచంలో బాగా చదువుకుని అనుష్ఠానం చేసుకుంటూ ఉపదేశాలు చేస్తూ, పీఠాలూ, మఠాలూ స్థాపిస్తున్నా – అంతా తామే అయిన ఆత్మ స్థితిని పొందకనే ఉపదేశాలు చేస్తారు – అని దానికి ఒక పోలిక చెప్పారు. "ఒక ఊరినుంచి యింకొక ఊరు నడిచిపోతూ దారిలో ఎవరినయినా మార్గం అడిగితే – 'అటు' అని మాత్రం చూపిస్తారు. ఆ ఊరు వెళ్ళాక మళ్ళీ 'ఫలానా వీధి ఎక్కడ?' అని అడిగితే చెప్పేవాడు యింకొకడు; ఆ వీధిలో 'ఆ యిల్లు' చెప్పేవాడు యింకొకడు; యిలా పరిమితంగా మాత్రమే దారి చెప్పేవాడు గురువు. 'ఈ సాధన చెయ్యి' అని విధించటం మాత్రమే చేస్తారు యీ గురువులు. దానిని సక్రమంగా చేయించే బాధ్యత వాళ్ళు వహించరు. సద్గురువు అలా కాదు. తానే దైవమై, తానే ఆత్మ అయినవాడు చివరిదాకా సాధన కూడా తానే అయి చేయిస్తాడు."

మహర్షికూడా అదే అన్నారు. తానే దైవమయిన గురువు మనలోనుంచే అవసరమయిన మార్పులు కలిగించి, మన తప్పులు మనకే తెలిసేటట్లు చేసి వాటిని అరికట్టే శక్తిని మనలోనే ప్రేరేపించి సరి అయిన మార్గంలో నడిపిస్తాడని.

అమ్మను ఎవరో ఏదో అడిగితే – "మాటలతో ఏం పని? చేతలు కావాలి గానీ" అన్నారు.

సద్గురువు గురించి మహర్షి చెప్పిన వాక్యం ఒకటి అమ్మకు చక్కగా వర్తిస్తుంది. గురువు శిష్యునకు తెలియజెప్ప వలసినవి ముఖతఃగా చెప్పాగూడా తను గురువునని చెప్పదనీ; అలా చెప్పుకున్నవాడు ఆ స్థానానికి అర్హుడుకాడనీ; కారణం- అంతా తానే అన్న సత్యాన్ని ఎఱుగక పోతేనే ఆ ద్వంద్వం మిగులుతుందనీ.

అమ్మ అడిగిన వాటినన్నింటికీ బాగా వివరంగా సమాధానంగా యిస్తారు. అయినా 'నేను గురువును కాను' అంటారు. "మేము అజ్ఞానంలోపడి కొట్టుకుంటున్నాం. మా అజ్ఞానాన్ని తొలగించండమ్మా-" అంటే "నాకు అలా తోచడం లేదు నాన్నా. **నాకు మీరంతా జ్ఞానస్వరూపులుగానే కనిపిస్తున్నారు"** అంటారు. **"తల్లికి తప్పే కనిపించదు" "తల్లి అంటే తొల్లి"** అన్న వాక్యాల్లో గూడా అమ్మ సద్గురువన్న స్ఫురణ ఉంది. "అహమాదిర్హి భూతానాం" అని కృష్ణుడు చెప్పిన దాని భావమూ యిదే. అంతులేనిదీ, అద్దులేనిదీ, ఆధారమయినదీ- అన్న పదాలు కూడా ఆత్మ, భగవంతుడు అని చెప్పబడేదానికి కూడా వర్తిస్తాయి. **"నేను అమ్మను"** అన్న మాటకు "నేను దైవాన్ని; నేను ఆత్మను" అనే అర్థం. ఈ భావాన్నే **"నేను నేనైన నేను"** అన్న మాటల్లో యింకా స్ఫుటం చేశారు. బైబిల్‌లో "I am that I am" అన్నట్లు.

అమ్మ సద్గురువయ్యీ ఉపదేశం చేయరేమిటి? - అని ప్రశ్నించవచ్చును. ఉపదేశం అంటే 'నేను బద్దుడయిన జీవుడను' అన్న భ్రమ తొలగించి 'నేనే ఆత్మను' 'నేనే బ్రహ్మను' అని తెలియజేయుటమే. ఎక్కడో దూరంగా మననుంచి వేరుగా ఉన్నాడనుకున్న దైవం మనలోనే ఉన్నాడని తెలియజేయటం ఉపదేశం. ఇదే సరిఅయిన నిర్వచనమని మహర్షి చెప్పారు. అమ్మ కూడా **ఉపదేశం అంటే "చెవిలో మంత్రం చెప్పటమూ నెత్తిన చెయ్యి పెట్టటమూ మాత్రమే కాదని"** చెప్పారు. ఉపదేశం చేయకపోతే ప్రాయోపవేశం చేస్తున్న ఒక భక్తురాలితో సాయిబాబా (షిర్డీ) అలానే చెప్పారు. గురువును శిష్యుడే గురువుగా పెట్టుకోవాలి అనీ. గురువు శిష్యులను అంగీకరించటం ఉండదనీ, మహర్షి అన్నారు - సద్గురువు చేసే ఉపదేశం మూడు విధాలు- స్పర్శ, దృష్టి, మౌనం. ఇందులో మహర్షి దృష్టి, మౌనం- అన్నవి రెండూ అవలంబిస్తున్నా- వారిలో మౌనం ప్రధానంగా ఉండేది. సాయిబాబాలో మూడూ కనబడుతాయి. మిగిలిన రెండు పద్ధతులూ మౌనంలోనుంచి పుట్టినవే కనుక మౌనంలో అన్నీ మాట్లాడి చివరకు అన్నారు "ఏదో మీ తృప్తి కోసం మాట్లాడుకోవటమే కానీ మౌనమే నాకు యిష్టం" అని.

## 14. అమ్మే ఒక అద్భుతం

అమ్మ సర్వసంగపరిత్యాగమేం చేయలేదు. ఈ ప్రపంచాన్నించి దూరంగా పారిపోలేదు. "సర్వత్రా అనురాగమే విరాగ"మన్నది. అమ్మ కాషాయ వస్త్రాలేం కట్టుకోదు. చీరెలే కట్టుకుంటుంది. అమ్మ జుట్టు జడలు కట్టుకుపోలేదు. ఆమె శిరోజాలు చక్కగా దువ్వబడి తరచు పుష్పమాలాలంకృతమయ్యే ఉంటాయి. ఒక ముక్కలో అమ్మ సామాన్య గృహిణి. సాధారణాలంకారాలతో వెలిగే యిల్లాలు. యోగులు తాంత్రికులు ఏ సత్యాన్ని ఆవిష్కరించుకోవటానికి ఈ మార్గాల నవలంబిస్తారో సాక్షాత్తూ ఆ సచ్చిదానందస్వరూపురాలైన అమ్మకు ఈ కాషాయ వస్త్రాలతో పని ఏముంది ? సన్యాసులు ధరించే కాషాయ వస్త్రాలు ఆంతరిక వైరాగ్యానికే మాత్రం చిహ్నం కాదు. దానిని పొందేటందుకు ఉపకరణాలు మాత్రమే. అమ్మ అన్నట్లు సన్యాసం **ఒకరు స్వీకరించేదికాదు – అయ్యేది.** ఆ స్థితిలో ఉన్న తర్వాత ఈ 'బాహ్యాడంబరాలు' అవసరం లేదు. **'సంసారంలో నీవు ఉండవచ్చు. కానీ నీలో సంసారం ఉండరాదు'** అంటుంది అమ్మ. పుట్టింది మొదలు నేటివరకు కనీసం శైశవంలో కూడా తనకుడ ఫలానిది కావాలని అడగలేదు. ఎంతటి తీవ్రమైన బాధను అనుభవించవలసి వచ్చినా ఎవరికీ చెప్పుకోలేదు సరికదా బాధను తప్పించుకునే ప్రయత్నమయినా చేయలేదు. ఇంతకన్న గొప్ప సన్యాసి ఉండగలడా ? "ఎంత సహిష్ణుత అమ్మా నీకు ! అని ఎవరైనా ఆశ్చర్యపోతే "బాధంటూ ఉంటేకదా భరించటానికి !" అని సమాధాన మిచ్చింది.

అమ్మ నొకసారి మీకెవరయినా శిష్యులు ఉన్నారా అని అడిగారు. "నాకెవరూ **శిష్యులు లేరు అంతా శిశువులే!"** అన్నది అమ్మ. భగవాన్ రమణమహర్షిని మీ కెవరయినా శిష్యులున్నారా అని అడిగినప్పుడు ఆయన తరపున ఆయన 'శిష్య' లొకరు "మహర్షి ఎవరినీ తనకన్న భిన్నంగా భావించరు. గనుక ఎవరూ ఆయనకు శిష్యులుగా ఉండలేరు" అన్నారట. 'నువ్వెవరివి !' అని అమ్మను ఒక సమయంలో అడిగితే "నేను అమ్మను" అన్నది. **"మాతృత్వమంటే స్త్రీత్వము కాదు. అమ్మ అంటే అనంతమైనదీ, శాశ్వతమైనదీ, సర్వానికీ ఆధారమైనది, అంతా అయిందీ, అర్థం గానిదీ"** అనీ **"తనలో ఉన్న మాతృత్వాన్ని** అవగాహన చేసుకోవటమే కాదు **మాతృత్వమంటే,** సర్వత్రా **మాతృత్వం ఆరూఢంగా ఉండాలి"** అనీ మాతృత్వాన్ని వివరించింది.

అమ్మ ఏవిధమయిన ఆధ్యాత్మిక సాధనలు చేయదు. చేయలేదు. సాధనల ద్వారా పొందగలమని చెప్పబడే అత్యున్నతస్థాయి యొక్క అవతారమామె. "నీ నుండి మేం కైవల్యం పొందగలమా ?" అని ఒకరు ప్రశ్నిస్తే **"నానుండి పొందే దేముంది ? అమ్మ ద్వారా పొందే దేముంటుంది ? అమ్మను చూడటమే పొందటం"** అని జవాబిచ్చింది.

అమ్మ వచ్చిన వారితో మాట్లాడుతుందా ? ఏమయినా బోధిస్తుందా ? అంటే మొదటిది అవును రెండోది కాదు. స్వంతతల్లితో ఎంత చనువు స్వేచ్ఛగా మాట్లాడవచ్చో అమ్మతోనూ అంతే. మన తల్లులకంటే ఎక్కువ ఆప్యాయంగా అమ్మ మాట్లాడుతుంది. "అమ్మల మరపించు అవని అమ్మవైనా అమ్మా" అని అందుకే ఒక కవి సత్యప్రవచనం చేశాడు. ఆమె సారధ్యంలో జంతుజాలం కూడా అమ్మ యెడల తమ అసాధారణ మాతృత్వ స్ఫురణ కూడా ప్రదర్శిస్తాయి. ఏ ప్రశ్నయినా అమ్మ నడగవచ్చు. ఎంతటి నిశితమయిన చర్చనీయాంశమయినా, అసంబద్ధంగా గాని, వైముఖ్యంతోగాని స్వీకరింపబడదు.

ఉపన్యాసములూ, ప్రబోధములూ అమ్మ చేయదు. "ఏమయినా చెప్పమ్మా! దాని ద్వారా మేం తరించేట్టు?" అని ఓ బిడ్డ అడిగితే **"ఊరక మాట్లాడి ఏం ప్రయోజనం? ఏది అవసరమో అది చేయడమే".**

మన స్వప్రయత్నమేమీలేదనీ, మనలో రావలసిన మార్పులన్నీ ఆమె ద్వారానే వస్తయ్యనీ అమ్మ భావం అయి వుండచ్చు. రమణమహర్షిని కూడా యిటువంటి కోరికనే కోరినప్పుడు "ఎక్కువ తెలుసుకోవాలనే ప్రయత్నంలో మీరెందుకు బరువు భారాలు పెంచుకుంటారు ? ఎక్కువ బాధలు పడటానికా ? ఓ గురువు సహాయం వల్లగానీ, శాస్త్రాధ్యయనం వల్లగానీ, ఆధ్యాత్మిక సంపన్నత వల్లగానీ, మరే యితరంగానూ పొందలేని పారమార్థిక పరిణామం, ఆ ముముక్షుత్వం యిప్పటికిప్పుడే యిక్కడికిక్కడే మహర్షుల సాంగత్యం వలన పొందగలుగుతారు" అని మందలించారు. ఒక మహర్షితోనే అలా అయితే అమ్మను **చూడటమే పొందటం"** అని భరోసా నిచ్చిన అమ్మ దగ్గర ఆ విషయం అంతకన్న రూఢంగా నమ్మవలసి వస్తుంది.

అమ్మ ఎట్లా కనపడతారు ? ఆమెలాగానే ఆమె భౌతికరూపం కూడా పరమాద్భుతం. ఎవరయినా అమ్మని దగ్గరిగా పరిశీలిస్తే, ఆమె ఆమె శరీరం కాదని

తెలుసుకుంటారు. **"అమ్మ అంటే ఈ జిల్లెళ్ళమూడిలో నాలుగు గోడల మధ్యన మంచం మీద కూర్చున్న అమ్మ అని కాదు – అమ్మ అదీ అంత్యమూ లేనిదీ, అది అంత్యమూ తానే అయినదీనూ"** అని అమ్మ చెప్పినప్పుడు ఈ సత్యం బహుశా సూచించినట్లే.

ఆలయాల్లో ప్రతిష్ఠించే ఓమాదిరి దేవీ ప్రతిమవలే పొట్టిగా వుంటుంది అమ్మ. ఆమె కవళికలు, చుబుకం, శిరస్సు, ఆ శరీర నిర్మాణమూ సాధారణంగా ఆలయాల్లో ఉండే దేవతా విగ్రహాలకు వలె ఉంటాయి. ఒక పొట్ట తప్ప. తన కడుపుపై చేతితో నిమురుతూ నవ్వుతూ అంటూంటుంది కూడా. తానెప్పుడు నిండుచూలేననీనూ, పచ్చి బాలెంతరాలేననీనూ. తన చేతిని అటూయిటూ నిమురుతూ అసంఖ్యాకమయిన శిశువులను గుర్తిస్తూంటుంది. తన గర్భంలో సమస్త తత్వాన్ని ఉంచుకున్న జగజ్జనని స్ఫురణకు తెస్తూ.

అమ్మ శరీరచ్ఛాయ అసాధారణ తేజోవంతమై వుంటుంది. అయితే పూర్వం ఉన్నంత రంగు ఉండదుకాని, కానీ ఒక రహస్యం – అమ్మ ధరించే వస్త్రాల కనువుగా తరచూ శరీరచ్ఛాయ అనుక్షణమూ మారుతూ ఉంటుంది. ఈ మార్పు ఎంతో పూర్తిగానూ, ఎంతో అల్పవ్యవధిలోనూ రావటంతో ఒకరు ఇది నిజమా ? లేక వ్యక్తిగత ఆలోచన ప్రభావమా ? యితమిత్థమని తేల్చుకోలేక అమ్మ చిత్రాలను పది పన్నెండింటిని ఒకేసారి తీశారు. విచిత్రం కొన్నింటిలో అమ్మ యువతిగానూ, మరికొన్నింటిలో ఎంతో వయోవృద్ధగానూ కనిపించింది. ఏ రెండుఫోటోలలో రూపము పెద్దగా కలవలేదు. ఆమె యిది ఒక మహత్యం చూపాలని తనలో మార్పు తేవటం కాదు – సహజంగా ఎప్పుడూ యిలా జరుగుతూనే ఉంటుంది. వచ్చేవాళ్ళే నిశితంగా చూడరు అంతే. వచ్చిన వారిలో 'చూచేవాడు' అమ్మను చూడటంతోటే అదృశ్యమౌతాడు. సృష్టి ఆధారపడిన పరిణామమనే ప్రాతిపదిక మారు రూపంగా అమ్మ గోచరిస్తుంది.

ముఖమండలం దివ్యతేజోవంతంగానూ శాంతికిరణాలు ప్రసరించుతూనూ ఉంటుంది. ప్రతివారికి ఒక సుదూరమైన పరిచితి ఏదో వినూత్నత గోచరించి, వచ్చిన వారు తెలిసో తెలియకో అమ్మ ముఖం వంక ఎంతో సేపు రెప్ప వాల్చకుండా చూస్తూ కూర్చుంటారు. పెద్దవారికే కాకుండా పసిపిల్లలక్కూడా యీ రీతిగా జరుగుతూంటుంది. అమ్మ ముఖంలోని పెద్ద కుంకుమ బొట్టు మరొకటి, చూచేవారిని ఆకర్షించేది. సౌందర్యాలంకరణ సాధనంగా నుదుట మధ్యగా గాక కనుబొమల మధ్యగా ఆ బొట్టుగా ఉండి మనస్సుకి మాతృత్వ స్ఫురణనిస్తూ ఉంటుంది.

గుండ్రటి చక్కటి చేతులకు అమ్మ ధరించే గాజులు, వేళ్లకు ఉంగరాలు ఒక వినూత్నతా, అలౌకికమయిన సౌందర్య దీప్తి ప్రసరిస్తాయి. ఆ కమనీయమయిన మృదుస్పర్శతో హృదయం మాతృప్రేమతో నింపి జీవితంలోని విసుగులూ విషాదమూ మరిచేట్లు చేసే అమృత హస్తములవి. ఆమె చరణ సౌందర్యము అసాధారణమూ, పారలౌకికమూ అయిందే. ఒకసారి రంగన్న బాబు "ఈ పాదాలు చూశారా ? యిటువంటి పాదాలు మీ రెక్కడా చూచి వుండరు. యిటువంటి పవిత్ర పాదాలు చూడగలగటమంటే సామాన్యమా ?" అని అన్నారు తన చుట్టు ఉన్నవారితో. అమ్మ దైవత్వానికి యింతకన్న నిదర్శనమేం కావాలనీ అన్నారు. పాఠకు లొక విషయం గుర్తుంచుకోవాలి. అవతార పురుషుల శరీరం మీద కనిపించే దివ్యచిహ్నాల గురించి ప్రాచీన పారమార్థిక విజ్ఞానంలో పూర్ణంగా చెప్పబడే వుంది. ప్రాచీన బౌద్ధ వాఙ్మయంలో కూడా ముప్పై రెండు అవతార చిహ్నాలను బుద్ధుని శరీరం మీద గమనించినట్లు చెప్పబడి వుంది.

అప్పుడే పుట్టిన పసిపాపలోని సౌకుమార్యాన్ని అమ్మ శరీరంలో చూడగలం. ఆగంతుకులు నమస్కరించే సమయంలో పాదాలపై బరువు ఆన్చినప్పుడు ఎంతో సేపు కందిపోయి వుంటాయి. కానీ అమ్మ కావాలనుకున్నప్పుడు కార్య కుశలతకూ కష్టసహిష్ణుతకూ, ఎంతటి వ్యాయామశీలి కూడా నిలువలేని దారుఢ్యాన్నినీ చేవనీ ప్రదర్శిస్తుంది అమ్మ. అమ్మ శక్తీ సౌకుమార్యాల పరాకాష్ఠనూ ఎలా తనలో సమన్వయం చేసుకున్నదో పరమాద్భుతం. ఉన్నట్లుండి వంటశాలలోకి జొరబడి అనుభవశీలురైన వంటవారు సైతం ఎంతో జాగ్రత్తగా నిడుపాటి గరిటెలతో కదిలించే మరుగుతూన్న పులుసులో చేయి జొనిపి పులుసు ముక్కలు బయటకు తీస్తూంటుంది. ఒకసారి అమ్మకు క్షీరాభిషేకం చేదామనుకున్నారు. గ్రామవాసులు కూడా ఈ అవకాశం జారవిడుచకో దలచక ఈ అవకాశం మళ్ళీ రాకపోవచ్చనే భయం కొద్దీ కాగుతున్న పాలను కుండలతో తెచ్చి అమ్మకు "క్షీరాభిషేకం" చేశారు. అమ్మలో దానికీ అప్పుడు చలనం ఏ మాత్రం లేక పోగా తర్వాతనయినా, తన శరీరం కాలినట్లుకాని, బాధపడుతున్నట్లుగాని కనబడలేదు. ఇంకోసారి పత్రితో పూజించాలనుకున్నారు. అనేక రకాలయిన ఆకులు సేకరించారు. అమ్మలో సస్యశ్యామలమయిన ప్రకృతిని ఆరాధించాలని కాబోలు ! ఈ ఆకులలో కొన్నింటికి వాటి నూగువల్ల విపరీతమైన దురదపుట్టించే గుణముంటుంది. అట్టి ఆకులతో పూజించిన వారి చేతులయితే దురదతో వాచిపోయాయి గాని, ఆమె

మాత్రం తనకేం పట్టనట్లుగానే కూర్చుంది. పూలతో గాక రాళ్ళతో పూజించాలని 'కుతూహల' పడిన ఒకానొక 'భక్తుడు' మోతాదు మించిన రాలు రువ్వటం కూడా ఎందరో ఎదిగినదే, వాడి 'ఆనందాని'కి కూడా అమ్మ అడ్డురాలేదు.

అమ్మ యే భంగిమలో ఉన్నా ఆ భంగిమ సాకారస్వరూపంలాగా ఉంటుంది. ఒక్క క్షణం క్రోధవీక్షణం ప్రసరించిందో ఎదుటివాడు అణగారిపోతాడు. ఎంతోసేపు నిస్తబ్ధుడయిపోయి నిశ్చేతనంగా ఉండిపోతాడు. ఆ సమయంలో అమ్మ విలయభీకర మహాకాలస్వరూపం కాదుగదా ! యిక చిరునవ్వుల చిందించదా ? అనిపిస్తుంది. మరి క్రీడా వినోద సమయాల్లో పసిపిల్లల అల్లరీ, వారిలో మనం చూచే ఆనంద జ్యోత్స్నలూ మనం చూస్తాం. తనతో మాట్లాడేవారిని ఎగతాళి చేస్తూ, వారు మాట్వాడే తీరూ చేసే విన్యాసాలూ అనుకరిస్తూ చూచే వారికి అమ్మను ఉగ్రస్వరూపంగా భావనా మాత్రంగానైనా నమ్మలేనట్లు ఉంటుంది. అనుకరించే తీరులో, ఎదుటివారు తన నుండి ఊడిపడ్డారా ? అనిపించేటంత సహజంగా సంపూర్ణంగా ఉంటుంది. అమ్మ స్వరూపంలోని సంపూర్ణమయిన మెలకువ, ప్రతిభ అలాంటివి.

అమ్మరూపం అప్పుడప్పుడు ఎంతో సమున్నతంగా (సాలప్రాంశుర్మహాభుజః అన్నట్లు) అందరికీ ఒక్కసారిగా దృశ్యమానమవుతుంది. నిజంగా ఆ సమయంలో అమ్మ అంత పొడవుగా ఉన్నదా అని పరిశీలించేందుకు అప్పుడు నా మనస్సు ఆ గమనికలో ఉండదు. కాని రోజులో వివిధ సమయాల్లో ఆమె శరీర పరిమాణంలో మార్పులు వుంటై అని మాత్రం చెప్పవచ్చు. ఒకసారి ఒకరు అమ్మకు చీర, కుట్టించిన రవికె సమర్పించారు. అమ్మకు రవిక చాలా చిన్నదైంది నిరాశతో 'నీ అది నాకు తెలీలేదమ్మా' అని క్షమాపణలు వేడుకుంటూ విచారిస్తూంటే **'నా ఆది ఎవరికీ తెలీదు. అందరి అది నా దగ్గరే ఉంది. నేను ఆదెమ్మను'** అంటుంది. ఆదెమ్మ అన్నపదంలోని పూర్తి పారమార్థిక సంకేతాన్ని స్ఫురింపచేస్తూ అన్నిరూపాలు ఒకటిలోంచి ఆవిర్భవించినవేనని గుర్తింపచేస్తూ.

తను సమర్పించింది అమ్మకు చాలకపోయెనే అన్న దిగులు మాత్రం ఆ వ్యక్తికి పోలేదు. కొంతసేపట్లో అమ్మ స్నానం ముగించుకుని ఆ వ్యక్తి సమర్పించిన వస్త్రాల తోనే దర్శనమిచ్చింది. ఆమె మాత్రం అమ్మ ధరించిన రవిక మాత్రం గుర్తించలేదు. కాని అమ్మ ఆమెకు గుర్తుచేసి సరిపోయిందమ్మా ! చూడు !" అని అన్నారు. క్షణకాలం క్రితం ఎంతో చిన్నదిగా కనుపించినా యిప్పుడు మాత్రం సరిపోవటంతో ఆమె నివ్వెర

బోయింది. నేనలా ఎన్నోసార్లు చూశాను. అమ్మకు యిచ్చిన గాజులు ఆ క్షణంలో ఎక్కక పోవడం కొద్ది క్షణాల తరువాత అవే సరిగా సరిపోవటం !

చివరికి ఒక విషయం మాత్రం ఒప్పుకోక తప్పదు ! ఆమె రూపంమాత్రం పరమాద్భుతం ! పై చెప్పిన మహత్వ పూర్ణమయిన సంఘటనల మూలంగానే కాదు - వాని వెనుక - ఆ శరీరం మాటున ఉన్న చైతన్యం అట్టిది. అగ్నిజ్వాలవలె, ఒక రూపంతో ఉంటూనే అనేక రూపాలు పొందగలిగిన సామర్థ్యం కలిగి ఉంటుంది. ఈ చిన్న గ్రామంలో మంచంపై కూర్చుని సృష్టి రహస్యమా అన్నట్లు ప్రకాశిస్తుంటుంది ఆమె. అనంతకాలం యొక్క ఇరుసూ చక్రమూ ఆమె అన్నట్లుగా, సృష్టివైవిధ్యంలో అంతర్లీనమై భాసించే ఏకత్వపు ప్రతిరూపమా అన్నట్లు ఉంటుంది.

## 15. నమ్మలేని అమ్మలేని అమ్మ

సకలసృష్టికీ శాశ్వతము, అనంతము అయిన ఆధారశక్తి యొక్క సాకార స్వరూపమయిన ప్రతి అవతారము సామాన్య మానవ స్వరూపపు చీకటి తెరలను చాటు చేసుకునే వుంటుంది. మానవరూపంలో సంపూర్ణావతారమని వ్యాసభగవాను లంతటి మహర్షిచే కీర్తింపబడిన శ్రీకృష్ణపరమాత్మ సైతం ఏ కొద్ది మందికో తప్ప అర్థమయ్యే అవకాశం యీయలేదు. ఆ కొద్ది మందికే తన దివ్యరూప సందర్శన భాగ్యం అనుగ్రహించారు. అత్యున్నత పరిణామం పొందిన మహనీయులు కూడా ఇట్టి లక్షణాలు ప్రదర్శించ వచ్చుగాని. వారి స్థితి మాత్రం ఎంతో తీవ్రపు యత్నంవల్ల పొందినట్టిది. అవతారపురుషులు మాత్రమే ఈవిధంగా సాక్షాత్కారిస్తారు అంటే అట్టి ఉదాహరణలలో అమ్మ ఒకరు.

'మీరు కానిది నేనేదీ కాను నాన్నా! అన్నది అమ్మ. ఒకసారి 'నాది తెలిసీ తెలియని స్థితి నాకేం తెలుసో నాకు తెలియదు' అన్నది. అమ్మ కృపావిశేషం వల్ల పొందిన మాహాత్మ్యాలను అనుభవాల నెవరైనా అమ్మకు తార్కాణంగా చూపితే "నే నేం చేయను మీ విశ్వాసంలోని గొప్పతనం అటువంటిది" అంటుంది. "నేను రోగాలు నయం చేయగలిగితే అసలీ అస్పత్రులన్నీ ఎందుకు? నేను మీ అసరాల్లో ఆదుకో గలిగితే ఎందరో బీదవాళ్ళుగా ఉండటం, ఎంతో మంది వస్తుండటం ఎందుకు?" తన కుమారుని అనుగ్రహించమని వేడిన ఒకానొక బిడ్డతో "ఎంత పిచ్చిదానివమ్మా ; మా అబ్బాయి పరీక్షల్లో తప్పాడు. మా అమ్మాయి ఆ పాడు తలనొప్పితో ఎప్పుడూ బాధ పడుతూనే ఉన్నది. నా పిల్లల్ని సరిగా చూచుకోలేక పోతున్నాను. నీ కేం

**చేయగలను చెప్పు"** అని సమాధానపరుస్తుంది. మనలో మనకు తెలియని శక్తి ఏదో ఆమె సర్వశక్తిమయి అని నొక్కి చెప్పుతున్నా, దారి తప్పించే ఆమె తర్కానికి మాత్రం నిరుత్తరుల మౌతాము.

అమ్మను యింకా దగ్గరగా జాగ్రత్తగా పరిశీలిస్తే అమ్మ మాటలు మన నెంత మోసగించాయో అర్ధమౌతుంది. అందరిల్లులోని వారితో మన పరిచయం పెంచుకున్నప్పుడు ప్రతి ఒక్కరు వారి వారి అనుభవాలతో ముందుకు వస్తారు.... అమ్మ మాటల్లోని సత్యాన్ని బోధ పరుస్తూ, అమ్మ వ్యక్తిత్వానికీ, ఉన్నట్లయితే మన వ్యక్తిత్వానికీ ఉన్న హస్తిమశకాంతరపు భేదం వల్ల అమ్మ మాటల్లోని విచిత్ర సంకేతాన్ని అర్ధం చేసుకోవటంలో విఫలమైనామని తెలుసుకుంటాం. ఈ అనుభవాలు కూడా అంత సులభంగా లభ్యపడువు. కొత్తవారు వచ్చి మీ మీ అనుభవాలేమిటి ? అని ప్రశ్నించినపుడు ఆవరణలోని వారు తమకేం లేనట్లు చెపుతారు. మనని త్రోవ తప్పించే ఉద్దేశంతో కాదు. కొంత కాలం గడిచిన తరువాత వారంతట వారే స్వీయానుభవాలు చెప్పినప్పుడు మీ కేమీ అను వాలు లేవంటివే' అని అడిగితే అప్పటికి అమ్మ అనుజ్ఞ రాలేదని చెపుతారు. అమ్మ నుండి కలిగే అనుభవాలలో ఒక చిత్రముంది. ఎంతో మహత్వపూర్ణమయిన అనుభూతులు పొందిన వారికైనా అవి వారి మనసులో ఎక్కడో సాధారణంగా జ్ఞాపకాల కందని పరిధుల్లో వుంటై. అంత అట్టడుగున ఉన్న అనుభవాల స్ఫురణ ఒక్కసారిగా పొంగి, వాక్యరూపంలో వెలువరిస్తే తప్ప తృప్తి కలగనంత వేగంతో వ్యక్తిని కదిలిస్తాయి.

ఈ దివ్యావతారంలో కొన్ని రహస్యమయ దృశ్యాలు వారి అనుభవాల్లో తెల్లమై సాధారణంగా మర్త్యస్వరూపపు మరుగున మనసు కందని పరిధుల్లోకి తీసుకుపోతాయి. అతి నిగూఢము అత్యంత విచిత్రము అయిన విషయం అమ్మ ఎప్పుడూ ఆహారమేమీ తీసుకోకపోవడం. "ఒక ముద్ద అన్నంగానీ కంటిమీద కునుకుగానీ ఎరుగదు" అని బామ్మగారు నిట్టూర్చారు. శైశవంలో కూడా ఎవరినీ తనకేదీ కావాలని అడుగలేదు. తన కోసం ఏమీ తినేందుకైనా, పాలకోసం ఏడ్చికూడా ఎరుగదు. పసితనంలో, సమయం చూసి పాలివ్వడం రంగమ్మ (అమ్మ కన్న తల్లి) గారివంతే అయింది. అయినప్పటికీ అమ్మ కృశించి పోవడంగాని బలహీన మవడం గాని లేదు. ఏమి తిన్నా యిముడని ఒకానొక వ్యాధి తనకు రావడం వలన ఆహారం తీసుకోలేదని తేల్చి వేసింది అమ్మ. కఠినవ్రతులైన మహర్షులకు, కష్టసాధ్యమైన ఒక వరం లాంటిది కాబోలు ఆ వ్యాధి. ఏదో ఒకటి తీసుకోమని తనను చుట్టుకుని వున్న పిల్లలు బలవంతం చేస్తే రోజుకు మూడు, నాలుగు సార్లు ఒక గుక్కెడు కాఫీ మాత్రం త్రాగుతుంది.

ఎందరో బలశాలులైన తన బిడ్డల్ని ఆశ్చర్య చకితుల్ని చేసే యింత శక్తి సామార్థ్యా లెక్కడివి ? అన్న ప్రశ్న నన్ను వేధిస్తూనే ఉండేది.

కానీ ఒకనా డొక చిన్న కుటుంబం అమ్మ దర్శనానికి వచ్చినప్పుడు సాష్టాంగప్రణామం చేసే తన్మయంత్వంలో వారుండగా అమ్మ ప్రసంగవశంగా "కొందరు ఏం చేసుకున్నా నాకు పెట్టింతరువాతనే వారు తిందామనుకుంటారు దూరదేశాల్లో ఉన్నా. కానీ జిల్లెళ్ళమూడికి బయలు దేరబోయే ముందు వారి పిల్లలకు యిడ్లీలు పెట్టాలన్న ఆతురతలో నెయ్యి, పచ్చడి లేని ఒట్టి యిడ్లీలనే నాకు పెట్టి, వాళ్ళ పిల్లలకు మాత్రం చక్కగా నేతితో రాచి పచ్చడి నల్పి పెట్టారు. నాకేమో ఒట్టివి తినడం కష్టమై పోతోంది." అంటుంది. ఆ దంపతులు ఆనందాశ్రువులు కారుతూండగా పదేపదే అమ్మకు నమస్కారం చేశారు. ఆ సంభాషణ పొడుగునా అమ్మ వారినే సూచిస్తున్నదని నాకు తరువాత తెలిసింది. విచిత్రమే మరి.

ఒకసారి గుంటూరు నుండి వచ్చే ఆర్. లక్ష్మీనారాయణ అనే సోదరుడు ఇటువంటిదే స్వీయానుభవ మొకటి చెప్పాడు. లక్ష్మీనారాయణ దంపతులు అమ్మయందు ఎనలేని భక్తివిశ్వాసాలు గలవారు. ప్రతిరోజూ వారు వండిన ఆహారాన్ని అమ్మకు నైవేద్యమిచ్చి, ప్రసాదంగా స్వీకరించే వారు. ప్రతి వారాంతంలో వారు జిల్లెళ్ళమూడి వస్తున్నప్పుడు వారింట్లో ఏయే రోజున, ఏం చేసుకొన్నారో, చెపుతూ నైవేద్యమెలా యిచ్చేవారో అనుకరిస్తూండేది. సరిగా ఉడకకపోయినా ఉప్పు, కారాలు సరిపోకపోయినా చెపుతుండేది. 'మమ్మ గురించేనా నువ్వు మాటాడుతున్నది ?' అని వారు అమ్మనడిగితే కపటకోపంతో 'నాపని యిదేనా ఏమిటి? ఎవరింట్లో ఏమేం చేస్తున్నారో చూడటమేనా? నేనేం దొంగనా ? నే చెప్పే విషయానికి మీ యింట్లో జరిగే విషయాలకు సరిపోతే అదేదో కదాచిత్‌గా జరిగిందంతే' అని అమ్మ సమాధానం చెప్పింది. ఎంతో తరుచుగా అసంఖ్యాకంగా జరుగుచున్న ఈ కధాచిత్సంఘటనలు చూస్తే,a perfect accident is a miracle. అని ఒక సోదరుని మాటే వీటికీ వర్తిస్తుంది.

అనేకమందికి ఉన్న యిట్టి అనుభవాల దృష్ట్యా జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయంలో వంట అయినాక అమ్మఫోటోకు నైవేద్యం పెడ్తున్నప్పుడయినా ఎంతో దూరంలో అమ్మ కూర్చోని త్రేన్చుతూ ఆకలి తీరినట్లుగా కనుపించడం నేను గమనించాను. పిల్లులు, కుక్కలు, కాకులు ఏవైనా నైవేద్య మిచ్చేప్పుడు ఆ ఆహారం దగ్గరకు సమీపిస్తే కొట్టవద్దనీ తరుమవద్దనీ ఆ రూపంలో అమ్మ వచ్చిందనుకోమనీ అమ్మ చెప్పటంలోని ఆంతర్యం నాకు లీలగా అర్ధమైంది.

అనేక స్థలాలో అసంఖ్యాకులయిన తనపిల్లలు సమర్పించే ఆహారం నుండే తనకు కావలసిన బలము వస్తుందనుకోవాలా ? అని నే నోసారి అడిగితే ఆ అవసరమేమీ లేదన్నది. అంతా అయిన శక్తికి సర్వసృష్టి ఎచ్చటనుంచి బలం పుంజుకుంటున్నదో ఆ శక్తికి ఎక్కడనుంచి ఆహారం స్వీకరించాలి? ఈ విషయాలు విశదీకరించే అమ్మ వైలక్షణ్యం అటువంటిది.

అమ్మ నొకసారి "మీరు ఆహారం వదలివేశారట గదా" అని ఒక రడిగితే "ఆహారాన్ని నేను వదలలేదు. ఆహారమే నన్ను వదిలింది" అని సమాధాన మిచ్చింది అమ్మ. ఆహారం వదలాలని ప్రయత్నించే వారిని ఆహారం గ్రహించే విధంగానే ప్రకృతి సూత్రమే ధ్వనిస్తుంది. సామాన్యమానవుడికీ ప్రోద్బల మిస్తుంది. ఆహారమే నన్ను వదిలిందన్న మాటలో ఈ ప్రకృతి సూత్రంలో చిక్కుకుని ఉంటాడు. అమ్మను మాత్రం ప్రకృతి బంధించి ఉంచలేదన్న మాట. "నీకు ఆకలివేయదా అమ్మా?" అని ప్రశ్నిస్తే **"ఈ కలిలో నాకాకలి లేదు"** అని ప్రత్యుత్తర మిచ్చింది. సర్వమూ తానే అయిన శక్తికి ఏదీ ప్రత్యేకించి వదలి వేయటం వుండదు అన్న సత్యాన్ని అమ్మ పునరుద్ఘాటిస్తున్నది కాబోలు.

అమ్మతో అత్యంత సన్నిహితంగా మెలిగే అదృష్టానికి నోచుకున్న కొందిరికి మాత్రం అమ్మ అప్పుడప్పుడు ప్రత్యేకించి ఆహారం వండించటం తెలుసు. తరచు అట్టి వంటకాలు ఇంకొకరు తినాలని కోరుకున్నప్పుడో ఒకానొక అనారోగ్యవంతుని కట్టి ఆహారం అవసరం అయినప్పుడో చేయిస్తుంటారు. కొన్ని సమయాల్లో మాత్రం తనకే ఫలాన వంటకం చేసిపెట్టమని అడుగుతుంది అమ్మ. ఒక అలవాటును మనం మానివేసే ప్రయత్నంలో కొంతకాలం ఆ అలవాటును తప్పించిన తరువాత. ఒక్కొక్కసారి ఆ అలవాటుకు లోనైనా అది నిగ్రహించుకోలేనంత బలం పుంజుకుని ఆ అలవాటుకు మనం లోనవుతాం. రెండు పూటలా భోజనం మాత్రం చేసే అలవాటున్న వారెవరైనా ఉదయం ఫలహారం ఒకటి రెండు రోజులు తీసుకున్నట్లయితే, అదే సమయానికి మరుసటి రోజు కూడా ఫలహారం కోసమే మనసు పరుగెత్తుతంది. కానీ అమ్మ విషయంలో మాత్ర మట్లాకాదు. ఎప్పుడో నూటికి కోటికోసారి అడుగుతుంది. తనకు ఆయా వంటకంచేసి పెట్టమని. తరువాత మళ్ళీ ఎప్పుడో ఎన్నాళ్ళకో గాని అడగదు. అటువంటప్పుడు అమ్మ కా ఆహారమయినా ఎందుకు ? అన్న రహస్యం మనం తెలుసుకోవాలి. వివిధస్థలాల్లో వివిధ సమయాల్లో తనకు సమర్పించిన నైవేద్యం స్వీకరించినట్లు ప్రకటించగలిగిన తల్లికి ప్రత్యేకించి ఒక పదార్థం కావాలని అడగటంలోని ఆంతర్యం ఏమిటి?

కొన్ని సమయాల్లో అమ్మ తనలో తను ఏదో రహస్యంగా మాట్లాడు

కుంటున్నట్లుండడం అత్యంత సన్నిహితులందరికీ తెలుసు. అయితే అప్పుడు అమ్మ సమీపంలో కూర్చున్న ఎవరెవరికో దృష్టి సారించినట్లుంటుంది. అమ్మ ముఖ కవళికలు చూస్తే మాత్రం పూర్తి ధ్యాస మనమీద ఉన్నట్లుండదు. అలా అని పిలువగానే పలుకుతుంది కూడా. ఈ విధంగా అమ్మ పదిమందిలో కూర్చుని, ఉన్నట్లుండి తనలో తను రహస్యంగా మాట్లాడుకుంటున్న ఒకానొక సంఘటన అమ్మ ఎందుకు తనకు ప్రత్యేకించి ఒక పదార్థం చేసి పెట్టమని కోరుతుందన్న రహస్యంపై వెలుగురేఖలు పరచింది.

1964లో ఏప్రిలు 26వ తారీఖున తన్ను దర్శించ వచ్చిన వారందరినీ భోజనాలకు 'అన్నపూర్ణాలయా'నికి పంపిన తరువాత అమ్మ తన 'అంతరాంతరాలయా'నికి వెళ్ళిపోయింది. ఆమెతో కొద్దిమంది మాత్రమున్నారు. ఉన్నట్లుండి అమ్మ మన మధ్యనున్న స్ఫురణ లేకుండా ఎవరినో సంబోధిస్తూ 'అమ్మా! శ్యామలా!" నిన్నెవరు చూస్తారు. నీకో చపాతీ చేయించి పెట్టనా?" అనటం మొదలు పెట్టింది.

అకస్మాత్తుగా సామాన్య స్ఫురణలోకి వచ్చి తన ప్రక్కనున్న వారితో "వారి దగ్గర గోధుమపిండి ఉందిగాని తీసుకుని ఒక చపాతీ చేసి తీసుకురా" అని చెప్పింది. తను రహస్యంగా మాట్లాడినప్పుడు విని ఉన్న నాకు తనకొరకే నన్నట్లుగా ఈ వెలిబుచ్చిన కోర్కెకు ఆ సంభాషణకు సమాధానం కుదరటం ఎంతో ఆనందాన్నిచ్చింది. ఎవరీ. అదృష్టవంతురాలు శ్యామల? అమ్మ ఏమయినా ఆహారం తీసుకుంటే అది తనకొరకు కాదని. ఎవరికొరకో అట్లా స్వీకరిస్తుందన్నది స్పష్టమైంది.

ఇంకోసారి 1963 అక్టోబరు 6న ఇటువంటి సంఘటనే ఒకటి జరిగింది. మామూలుగా తన పక్కవారితో మాట్లాడుతూ ఉన్నట్లుండి 'పరధ్యానం'గా "మూడు రోజులనించి చపాతీ చేసిపెట్టమని అడుగుతున్నా. సత్యం (హోటలు నడుపుతుంటాడు) యింతవరకు అవి చేసిపెట్టలేదు. ధనవంతులయిన వారికి ఏంకావాలో అది తెప్పించుకోగలిగిన వారికే చేసిపెట్టటమెందుకు? నాకెవరూ లేరు, నాకు చేసిపెట్టండ్రా చపాతీ" అన్నది. కొంతసేపయినాక మళ్ళీ "నే నివ్వాళ నియమంగా ఆహారం తీసుకోవాలి. వెంటనే పదినిమిషాల్లో రెండు చపాతీలు. కొద్దిగా వేడినీళ్ళు తెచ్చిపెడ్తావా?" అని తనప్రక్కనున్న ఒక ఆమె నడిగింది అమ్మ. అలాగే పదినిమిషాల్లో అమ్మ అడిగినట్లు ఏర్పాటు చేయబడింది. ఇప్పుడే బార్లీ జావ త్రాగానని అవి స్వీకరించ నిరాకరించింది. తీసుకొమ్మని బ్రతిమాలగా మంచం మీద పడుకునే తినటం ప్రారంభించింది. తింటూ, మళ్ళీ పరధ్యానంగా "తడి ఉండకూడదు. దీన్ని సరిగా కాల్చారా? జాగ్రత్తగా ఉండకపోతే గర్భంలోకి నీరు చేరుతుంది. అందుకే యివ్వాళ

ఆహారం నియమంగా తీసుకోవటం మంచిది." "ఎవరికమ్మా" అని అడిగితే "ఆమెను గురించి అడుగుతున్నావా?" అని చెప్పటం మొదలు పెట్టింది. ఆ మాట్లాడే సమయంలోకూడా, మన ప్రశ్నలకు సమాధానం చెప్పేటప్పుడు కూడా అమ్మ మనమధ్య ఉన్నట్లులేదు 'పరధ్యానం' గానే ఈ మాట్లాడటం.

"పండరిపురంలో ఒక కొండజాతి దంపతులకు కుమార్తె ఉంది. ఆమె సంసారంలోని కష్టాలు భరించలేక తను తరచు తపస్సు చేసుకునే అడవులలోకి పోయింది. అరణ్యాలకు పోయినట్లు ఆమె పెనిమిటికి తెలిసింది. ఆమెను వెతికి పట్టుకుని క్రూరంగా ప్రవర్తించాడతను. ఆమె గర్భిణి, గృహిణిగా జీవిస్తున్నా ఆమె మనస్సు మాత్రం పవిత్రంగానే వుంది. ఆమె గర్భంలో శిశువు చనిపోయింది. ఆమె మళ్ళీ తపశ్చర్య నారంభించింది. పూర్వపు స్త్రీ కాదామె యిప్పుడు నిరంతర ధ్యానంలో గడుపుతూంటుంది. ఆమె తల్లి తెనాలిలో మాతాత గారింట్లో పనిచేసేది."

అమ్మ మాట్లాడుతూ తింటూనే ఉంది. ఆ 'పరధ్యానం'లో చపాతీలు పెట్టిన ఆకుని కూడా నోట్లో పెట్టుకుంది. నిర్జనారణ్యాల్లో ధ్యాననిమగ్నమైన తపస్విని అవసరాలు తీర్చే తత్పరతలో ఆమె ఏం చేస్తున్నదీ గమనించేస్థితిలో లేదు. మాలో ఒకరు హడావుడిగా అమ్మ నోటిలోని ఆకుని తీసివేశారు. అప్పు డమ్మ మావైపు తిరిగి నిశ్శబ్దంగా పడుకుంది. ఆ క్రిందటిరోజున అమ్మ అనుభవించిన మనోవ్యధకీ, అమ్మలో కనుపించిన విషాదచ్ఛాయలకీ ఒక క్రొత్త అర్థం. ప్రత్యేకత మాకు స్ఫురించింది. నాడు అమ్మ చెప్పిన మాటల మూలంగా, అమ్మ ఎందుకు ప్రత్యేకించి అప్పుడప్పుడు తన కేమయినా చేసిపెట్టమంటుందో కొంతవర కిప్పుడు అవగతమైంది నాకు.

1964 ఆగష్టు 9వ తేదీన అమ్మ తలంటుకునే సమయంలో వసుంధర అమ్మ వద్దకు వెళితే "నేను యిప్పుడు మూడు యిడ్లీలు తిన్నాగా కమ్మటి నెయ్యి రాచిన యిడ్లీలు" అన్నది అమ్మ.

"ఎవరు పెట్టారమ్మా"

"ఎవరో ఒకరు"

"చెప్పమ్మా"

"నీకు చెప్పాలనుందా ఏమిటి? నా రహస్యాలు నీకెందుకు చెప్పాలిట ? నువ్వు నాకు చెప్తున్నావా ? నేనేం చెప్పను."

"రామకృష్ణ యిచ్చాడామ్మా యిడ్లీలు?"

"వాడేం పెట్టలేదు."

"కాదు."

"అయితే ఎవరో చెప్పమ్మా"

"నేను చెప్పను."

"కొన్ని వేలమైళ్ళ దూరంలోనా?"

"కాదు."

"వందమైళ్ళ లోపలేనా?"

"అవును" అంటూ స్నానాల గదినుంచి వెళ్ళి పోయింది అమ్మ.

ఇట్టిదే నా స్వీయానుభవమొకటి చెప్పి ముగిస్తాను. ప్రతి సంవత్సరం ఆగస్టు 19 నేను అమ్మ దగ్గరకు వచ్చినరోజు గాబట్టి పండుగ చేసుకుంటాను. 1964 లో ఆరోజున క్షీరాన్నం చేయించి అమ్మకు నైవేద్య మిచ్చాను.

పెద్ద గిన్నె నిండా పరమాన్నముంది; పొయ్యి మీదనుంచి ఉన్నపళంగా తెచ్చాం. పొగలువస్తూ చాలా వేడిగా వున్నది. సాధారణంగా అమ్మ ఒక చుక్క నోటిలో వేసుకుని మిగిలింది అందరికీ పెట్టమని యిచ్చేస్తారు. కానీ ఈ సారి మాత్రం అమ్మ ఆ వేడి వేడి పాయసాన్ని తినటమారంభించింది. ఈ సమయంలో ఆమె ప్రదర్శించే 'పరధ్యానం' మళ్ళీ కనపడింది. ఎంతో త్వరగా ఆ గిన్నెలోని పాయసమంతా ఆరగించిందమ్మ. బాగా తినగల వాళ్ళక్కూడా ఎక్కువయ్యేంత పాయసమది. అమ్మ తినే సమయంలో అమ్మ దృష్టి మాత్రము కూర్చున్న మంచానికీ ఎదురుగా ఉన్న గోడకీ మధ్య నిలిచి వుంది. "కొంచెం తిను ఇంకొంచెం తినమ్మా" అని ఒక పసిపిల్లకు తినిపించినట్లు మాట్లాడింది. తినటం అంతా పూర్తి అయినాక మన స్ఫురణలోకి వచ్చి "అంతా అయిపోయిందే నీవేం తింటావు?" అని అడిగింది. నేను సమాధానం చెప్పేలోపుగానే ఖాళీ గిన్నెలో చేయి కడుగుకొని "నువ్వు యిది తీసుకో" అన్నది అమ్మ. 'పరధ్యానమూ', ఒక్క వ్యక్తీ తినటమసంభవమైనంత పాయసం స్వీకరించటమూ, అమ్మ పలికిన మాటలూ అంతా ఒక రహస్యాన్ని విశదీకరిస్తున్నట్లే ఉంది. అమ్మ ఏమయినా తిన్నా, కావాలని కోరినా ఆపదల్లోనో, తపోనిమగ్నులయో ఉండే ఎవరికోసమోనని నా కిప్పుడు తెలుసు. "నీకేం కావల్సివచ్చినా నువ్వెక్కడయినా కొనుక్కు తినగలవు. ఎక్కడో అరణ్యాల్లో ఉండి అవసరాలు గమనించేందుకు ఎవరూ లేని వారి నెవరు చూస్తారు" అన్న అమ్మ 'నిగూఢమూ అసంపూర్ణమూ అయిన వాక్యంలోని' అమ్మ సంకేతం నా కర్థమయింది.

నాకు తెలుసు వారి అవసరాలెవరూ తీరుస్తారో.

## 16. కన్నీటిలోని దివ్యత్వం

అమ్మను ఒకసారి చూచిన తరువాత మనం ఎందువలన అమ్మ సాన్నిధ్యానికి మళ్ళీ మళ్ళీ నిర్నిరోధంగా చేర్చబడతాం? అమ్మను చూడకముందు మన జీవితం తెలియని దానికొరకై పరిశోధన. జిల్లెళ్ళమూడిలో మాతృశ్రీ ప్రథమ దర్శన మయిన తరువాత. ఆమె చెంగట మనం అనుభవించిన ఆత్మ సంతృప్తికై వెదుకులాటగా

జీవితం తయారవుతుంది. మరెక్కడా మనం అనుభవించలేని, మనకు తెలిసిన ఒక తృప్తికోసం అన్వేషణగా మారుతుంది. ఆమె పవిత్రచరణ సీమలో మన జీవితాలు బరువు బాధలనుండి విముక్తమయినట్లు అనుభూతమవుతుంది. మొట్టమొదటిసారిగా మన వ్యక్తిత్వం శూన్యం వలె సువిశాలమవుతున్నట్లు, ఆకాశంవలె స్వచ్ఛమవుతున్నట్లు, నవశిరీషపేశలమై ఆనందమయవుతున్నట్లు భావించటం జరుగుతుంది. మనసు నిర్వాత దీపకళికవలె నిశ్చలం గాను, ఉదయభాస్కర ప్రభా భాసమానంగాను ఉన్నట్లు గమనిస్తాం. అమ్మ దగ్గర పవిత్రమూ, పరమానందమూ అయిన మన స్వస్వరూపాన్ని చూడగలుగుతాం. అమ్మను చూడక పూర్వము ఎలా ఉన్నామో చూచిన తరువాత ఎలా ఉన్నామో ఆ బేధం గూడా స్పష్టంగా గుర్తిస్తాం. అందుకై పునః పునః అమ్మ దర్శనానికి పరుగెత్తుతాం. "గురువు మౌనంగా ఉన్నాడు అందరిలోనూ శాంతి పరిఢవిల్లుతోంది. చాలా నకృత్తగా లభ్యమయ్యే ఏ ఒకానొక మహర్షిలోనో విరాడంతరంగం ఆవిష్కారమయినప్పుడు అది వ్యక్తి మనస్సును ఆత్మతో జోడింపగలుగుతుంది" అని రమణుల ఉపదేశామృతం గుర్తుకు వస్తున్నది.

అమ్మ సాన్నిధ్యంలోని అనుభవాన్ని సూక్ష్మ పరిశీలనచేస్తే, దైనందిన జీవనంలో చికాకు కలిగించే అసంఖ్యాక మయిన సమస్యలు, అనుదినమూ మనస్సు నిష్ప్రయోజనంగా నిర్మించుకునే ఊహాసౌధాలు, ఏర్పరచుకొనే అభిప్రాయాలు 'అన్నీ అదుపులో పెట్టబడతాయని గమనిస్తాం. చీకటి తెరలు దింపగానే ప్రశాంతమావరించిన మహానగరంవలె మనస్సు నిర్వల మవుతుంది. నిశ్చల శాంతి నిలుస్తుంది. తరువాత అయినా ఆలోచనలు వస్తూనేవుండవచ్చు. మనస్సీమలో నగరంలోని కొద్దిమంది నిశాచరులవలె. అయినా ఆ ఆలోచనలు అమ్మ గురించి, ఆమె దివ్యత్వాన్ని గురించి, 'అందరిల్లు' లోని కార్యకలాపాలగురించి మాత్రమే అయివుంటాయి. మన స్వప్రయత్నంవల్ల సాధించలేక పోతున్న ఏకాగ్రతకు మనకు తెలియకుండానే మనస్సు చేరువవుతుంది. మన నివాసం పవిత్రత. నిశ్చలత, ఆనందముల త్రివేణి సంగమమే అవుతుంది. ఒక్క ముక్కలో మనకు తెలియకుండానే, మన ప్రమేయం లేకుండానే సాధన దానంతట అది జరుగుతూనే వుంటుంది. పరమాద్భుతమయిన అమ్మ దివ్య స్వరూపం, అతులితమయిన మధుర భాషణలు, ఆమె పూర్ణమౌనము. ఆమె ఆనందము, ఆగంతుకుల మనస్సుని మంత్రముగ్ధం చేస్తాయి. ఒకేఒక్క ఆలోచన సార్వభౌమత్వం చేస్తుంది వారిలో – 'ఆశ్చర్యకర వాత్సల్యాం వందేమాతర మద్భుతాం'

వచ్చే వారిలో అధికాధికుల కనుభూతమయిన అసాధరణమైన విశేషమేమి టంటే, విచిత్రమూ అనిర్వచనీయమూ అయి అకస్మాత్తుగా పెల్లుబికే ఒకానొక భావావేశం వల్ల కంటివెంట అశ్రువులు కారటం, కంఠం గద్గదం కావటం, పెదవులు

చుబుకము వణకటం. మరికొన్ని సమయాల్లో అమ్మ ఒడిలో నున్నప్పుడో పాదాభివందనం చేస్తున్నప్పుడో పెద్దగా 'విలపించటం.' ఈ అనుభవానికి గురి అయినవారుకూడా కారణం వివరించలేరు సరికదా తరచు యిట్టి భావావేశానికి గురి అవుతూనే వుంటారు. తన దర్శనార్థం వచ్చే చాలామంది ఎందుకు తన ఎదుట విలపిస్తారని అమ్మని అడుగ సాహసించాను. చాలాసార్లు సమాధానం దాటవేసింది అమ్మ. **'ఎదుటి వ్యక్తిలో మంచితనాన్ని చూస్తే ఏడుపొస్తుంది'** అని ఏదో ఒక సమాధానం యివ్వడానికి చెప్పినట్లుగా అనేది. అసలు కారణం చెప్పమని నేను గట్టిగా ప్రాధేయపడినప్పుడు **'పుట్టగానే పసిబిడ్డ ఎందుకు ఏడుస్తుందో అదే కారణం'** వీరికి కూడా నన్నది.

అంటే నీ దర్శనంతో వారి ఆంతర్యం పునరుద్భవించినట్లా?' అని ఒకరు ప్రశ్నిస్తే

"అవును, నిజానికది విచారంకాదు. సామాన్యంగా దుఃఖానికొక కారణమంటూ వుంటుంది. కానీ యిది అకారణం. అది నిజంగా ఏడవటంకాదు. అంతకన్న మంచి పదం దొరకక దాన్ని ఏడవటం అంటారుగాని" అని ప్రత్యుత్తరమిచ్చింది. అమ్మ ఆ రహస్యమయానుభూతిని స్పృశించి హృదయ కవాటాలు తెరచినప్పుడు ఎదుటివాని వయస్సు, స్థాయి, మనోనిబ్బరం యివేవీ పనిచేయవు ఆ భావనా విశేషాన్ని అదుపులో నుంచటానికి. ఆ విచిత్రానుభవం తరువాతి క్షణాలు సమాధిగతుడైన వాని అనందానికి చేరువగా ఉంటాయి. డగ్గుత్తికతో వణకటం, శరీరం వణకటం, కంట అశ్రువులు కారటం తీవ్రభక్త్యావేశ చిహ్నాలని నారదభక్తి సూత్రాలలో చెప్పబడే వుంది.

ఈ అశ్రుస్రవంతి నేను లోనుగానని. దానిని అదుపులో నుంచగలనన్న ధీమా నాకుంది. అలా నా అతిశయం ప్రకటించాను కూడా. అమ్మ బరపిన ఒక్క వీక్షణం చాలు మనలో ఆ భావవేశం కట్టలు త్రెంచుకు బయటపడటానికని నేను గమనించాను. ఒకసారి పూజ జరుగుతున్నది అమ్మ వేదికపై ఆసీనురాలైంది. నేను చూస్తూ కూర్చున్నాను. ఒకసారి అమ్మ నావైపు చూసింది. వెంటనే నాకు విచారమావరించింది. నేను ఆలోచించటం యాదృచ్ఛికంగానని ఆశ్చర్యపోయాను. కావాలని అమ్మ నా యెడ దృష్టి సారించకుండా ఉంది. ఎందుకో తెలియదు. ఈ ఆలోచన నాలో సాగుతూన్న సమయంలో అమ్మ రెండోసారి చూచింది. అంతే రెండు కళ్ళనిండా నీళ్లు నిండాయి నాకు. గొంతు గద్గదమయింది. అశ్రువుల నరికట్టే ప్రయత్నంలో మనస్సు బిగువయింది; అప్పుడర్థమైంది అమ్మ నా వేపు అంత సమయమెందుకు చూడలేదో; పెల్లుబికే తీవ్రావేశానికి, నిగ్రహించాలన్న తీవ్రప్రయత్నానికి మధ్య నలిగిపోతూన్న నేను అంతర్యంలో ఈ బాధనుంచి తప్పించి లోని భావావేశం ప్రకటితం కానిమ్మని అమ్మను

ప్రార్థించాను. అప్పుడు అమ్మ తన దృష్టి నా యెడల నిలిపింది. కళ్ళనుండి అశ్రువులు ధారగా జాలువారాయి. నాలోని పట్టు సడలి నేను చాలా హాయి ననుభవించాను. మన భావాలు ఆమె అదుపాజ్ఞలలో ఉంటాయని గమనించాను. ఎన్నో సందర్భాలలో ఉబుకుతూన్న అశ్రువులను దుఃఖాన్ని నిగ్రహించే ప్రయత్నంలో విపరీతమైన అంతస్సంఘర్షణ కొరకు గురి అయిన వారిని అమ్మ దగ్గరకు పిలిచి తల నిమురుతూండటం నేను చేశాను. అప్పుడు పొంగి పొర్లే భావాలతో అమ్మ ఒడిలోనో, పాదాలవద్దనో విలపిస్తారు. కొంతమంది అదే మానసికావస్థలో చాలా కాలం వుంటారు. మరి కొందరు అమ్మను కొద్ది క్షణాలు, నిశ్చలంగా చూస్తే చాలు ఎడతెగకుండా కన్నీళ్ళు కారటం అనుభవిస్తారు. నియమ నిష్టలతో ఏ సాధనను చేయలేని మనను చూడగానో అమ్మను స్పృశింపగానో అమ్మ ఒక్కమాట పలికితేనో తీవ్రభక్త్యావేశం మనలో అవతరించేటంతటి ఆధ్యాత్మికోన్నతికి తీసుకు వెడుతుందంటే నిజంగా అది ఆమె అనుగ్రహమేననాలి. ఇదే కన్నీటిలోని దివ్యత్వం.

ఇట్టి అనుభవానికసలు ఆధారమేమిటి ? భగవాన్ రమణుల క్రింది ప్రసంగంవల్ల దాని జాడ కొద్దిగా తెలుస్తుంది. 'గురువు మనసు సంతర్ముఖం చేస్తాడు. గురువు జిజ్ఞాసువు హృదయంలోనే తిష్ఠవేసివుంటాడు కనుక అంతర్ముఖమైన మనస్సును హృదయానికి లాగుకుంటాడు."

'తనవల్ల పరిపూర్ణత పొందవచ్చునా?' అని ప్రశ్నించినప్పుడు **"నా వలన పొందేదేముంది. నేను తల్లిని. నన్ను చూడటమే పొందటం"** అన్న అమ్మ సమాధానం పై రమణ సూక్తికి సంక్షిప్త రూపమేగదా:

రమణ మహర్షులతో ఒక శిష్యుని సంభాషణతో ఈ వ్యాసం ముగిద్దాం.

శిష్యుడు : "ఆత్మ విద్యా విలాసము, మున్నగు పుస్తకాలలో గద్గదస్వరము, ఆనందభాష్పాలు మున్నగునని చెప్పబడి ఉన్నాయి. ఈ లక్షణాలు సమాధిలో కనిపిస్తాయా? సమాధికి పూర్వముకాని తరువాతకాని కనుపిస్తాయా ?

రమణ : సూక్ష్మాతి సూక్ష్మమైన మనోవృత్తి లక్షణాలివి. సమాధి అంటేనే పరమ ప్రశాంతత. అయితే వీటికి చోటెక్కడవుంది ? అనుభవించిన సమాధిస్థితి జ్ఞాపకాలు ఈ లక్షణాలకు దారితీయడం జరుగుతుంది. ఈ లక్షణాలు భక్తి మార్గంలో సమాధికిముందు ఉంటాయి.

**"పుట్టినప్పుడు ఎందుకు ఏడుస్తారో అదే కారణంగా తన్ను దర్శించినప్పుడు కూడా ఏడుస్తార"**ని అమ్మ చెప్పటం తన దర్శనం పారమార్థిక పునర్జన్మ మని సూచించినట్లు, అదే సత్యాన్ని వివరిస్తూ రమణమహర్షి సచ్చిదానందమయిన ఆత్మ నుండి అహంకారం ఉద్భవిస్తూనే ఆత్మను మరచి పోవడమే జన్మ. తల్లిని తిరిగి

పొందాలన్న ప్రస్తుత వాంఛ వాస్తవానికి ఆత్మను తిరిగి పొందాలన్నదే. ఆత్మ సాక్షాత్కారం పొందటం అహంకారం నశించడమన్నమాట ఇదే శరణాగతి.

## 17. అమ్మ సాన్నిధ్యం

చాలాకాలం ఉన్న స్ఫురణ లేకుండానే అమ్మ సాన్నిధ్యంలో గంటలూ, రోజులూ దొర్లిపోతాయి. జిల్లెళ్ళమూడిలో ఉండటం అన్నది తమ ఉనికితోనే క్రమంగా తాదాత్మ్యం చెందుతుంది. మనస్సుకి ఆలోచనలు అరుదుగా వస్తాయి. శాస్త్రాలలో విపరీతంగా పొగడబడే అమనస్కమనే స్థితిలోని ఆనందాన్నే అక్కడ ఎవరయినా అనుభవించేది.

వారి వారి సహజ స్వభావాలకు అనుగుణంగానే అమ్మ సాన్నిధ్యంలో వారి వారి మనసులు ప్రతిఫలిస్తాయి. కొందరు వారి 'అహం' తల ఎత్తి అమ్మను అంచనా వేయ ప్రయత్నిస్తారు. మన అహంకారాన్ని తునియలు చేసే అనుగ్రహ మామె ప్రసాదిస్తే తప్ప ఆమె అవగాహన కందదనీ. ఎంతవరకు ఊహిస్తే అంతవరకు ఆమె పెరుగుతుందనీ సుదీర్ఘమయిన అనుభవంతోగాని మనకు బోధపడదు. మరికొందరికి విచార సదృశమయిన ఒక భావనగా వారిలోని భక్తి ప్రపత్తులు ప్రకటితమౌతాయి. మరి కొందరికి మాత్రం ఏమీ ప్రత్యేకతలేని సర్వసామాన్య వనితగా అమ్మ కనపడుతుంది. కాలం గడిచేకొద్దీ వారి యీ అభిప్రాయం వారు అనుభవిస్తున్న అమనస్కస్థితి యొక్క వివరణే ననిపిస్తుంది. బహుకొద్దిమందికి మాత్రం సౌభాగ్యవశాన సంపూర్ణమయిన అమనస్కస్థితి లభ్యమవుతుంది. కానీ సర్వసామాన్యమయిన ఆగంతుకులందరూ తమ ప్రపంచపు బాధలు, చిక్కులు మటుమాయంచేసే అంతశ్శాంతి, సంతృప్తులను అనుభవిస్తారు.

మనం సాధారణంగా 'నాకు కూర్చోవటానికీ కూడా వ్యవధి లేదు' అనిపించేటంతటి కాలప్రభావం వల్ల రోజులు గడుస్తున్న కొద్దీ సమయం సన్నగిల్లిపోతుంది. జిల్లెళ్ళమూడిలో ఉండటంతో కాలం అంటే ఒక అరుదైన అనుభవం కలుగుతుంది. గంటలు రోజులు గడచిపోయే కాలంగా కాక, ఎడతెగని వర్తమానమే మనకనుభవమవుతుంది. మననున కట్టడుగున ఏం జరుగుతున్నదో గమనించకపోవటం వలనగాని, అక్కడ ఉన్న కాలంలో ప్రక్కవాడితో వ్యర్థప్రసంగాలతో సమయం వెళ్ళబుచ్చటం వలనగాని, ఈ అనుభవం మనకు దూరమౌతుంది. 'ఇంతకాలం'గా వచ్చి పోతున్నా మాలో చెప్పుకోతగినంత అనుభవం మాకేం కలగలేదని గోలపెట్టే వాళ్ళు కొంతవెనక్కి తిరిగి ఆత్మపరిశీలన చేసుకుంటే వారి అభిప్రాయంలోని దోషం ప్రస్ఫుటమౌతుంది. అటువంటి వాళ్ళల్లో నేనూ ఒకణ్ణి. "అమ్మా! చాలామంది వారివారి అనుభవాలను గురించి చెప్పుకుంటారు. నాకెందువల్ల ఏవిధమయిన

అనుభవమూ కలుగలేదు?" అని అడిగితే 'అనుభవంలేకపోవటం ఒక అనుభవంకదూ' అన్నది అమ్మ. నివ్వెరపోయాను నేను.

అనుభవం లేదని నేనన్న స్థితి మాత్రం నిస్తరంగ సముద్రం వలె ఆలోచనలుప్పతిల్లని మనసుని సూచిస్తుంది. కాని నిత్యజీవితంలో మన కనుభవవమయే అనుభవశూన్యమయిన మానసికస్థితి మాత్రం కాదని మాత్రం నే నిప్పుడు చెప్పగలను. సాయిబాబా యిటువంటి ప్రశ్నకు ఈ విధంగానే సమాధానం చెప్పారు. దర్శనాలూ అనుభవాలూ జీవి ప్రగతి గమనాని కేమీ నిదర్శనాలు కావని, ముని మౌనంలో ద్యోతితమయే ఆత్మశాంతియే అనుభవానికి మించిన తార్కాణమవుతుందని రమణ మహర్షు లొకసారి అన్నారు. అన్ని ప్రపంచపు బంధాలను, ప్రపంచంలో అన్ని దిగుళ్ళను తుడిచి పెట్టే ఒకానొక నిర్నిబంధమయిన తృప్తి, అంతరికమయిన అవ్యక్తమయిన ఆనందమూ పవిత్రలతో మనిషి నిండిపోతాడు. అన్ని ఆధ్యాత్మిక సాధనలకు లక్ష్యభూతమయిన ఈ ఆనందం. ఈ పవిత్రత, మనోవైశాల్యము ఏప్రయత్నము లేకుండానే అమ్మ సాన్నిధ్యంలో అనుభవించగులుగతారు.

కొద్దిమంది మాత్రం ఒక ప్రత్యేకమయిన సాధనను నామజపమో మంత్రజపమో చేసేవాళ్ళున్నారు. వారికీ వారి అనుభవాలున్నాయి. సింగుపాలెంకు చెందిన శ్రీయేర్లగడ్డరాఘవయ్యగారు అట్టి వారిలో చాలా అదృష్టవంతులు. అమ్మ దివ్యదర్శనమైంది వారికి. కొందరు వారు ఆరాధించే చిత్రంలో అమ్మను దర్శిస్తారు. మరి కొంతమందికి మాత్రం ఎంత ప్రయత్నించినా సాధ్యపడని సాధన అమ్మ సాన్నిధ్యంలో అ ప్రయత్నంగా నిరంతరం దానంతట అది జరగటం గమనిస్తారు. ఇంకొందరు నియమ నిష్టలతో ధ్యాన జపాదులు చేసేవారు కూడా అమ్మను దర్శించినాక అన్ని ఆధ్యాత్మిక సాధనలు నిరుపయోగంగానూ, దైనందిన కార్యక్రమాల్లో భంగం వాటిల్లినా అమ్మ సమక్షంలో ఉంటే చాలనీ. అదే వారి జపతపాదులను మించినదని భావిస్తారు. వారిలో కొద్దిమంది మాత్రం సాధనను పూర్తిగా వదలి వేశారు. అమ్మయే సర్వబాధ్యతలూ వహిస్తుందన్న సంపూర్ణ విశ్వాసం. సమగ్రమైన అనుభవం వారు పొందటం వారి సౌభాగ్య విశేషం. సాధన చేస్తున్న వారికి మాత్రం అమ్మ సాన్నిధ్యంలో వారి ప్రయత్నము సువిశాలమూ ఆధారమూ సర్వ స్పర్శమూ అయి నిరాటంకంగా సాగుతుంది. ఏ విధమయిన ఆధ్యాత్మిక సాధనలు చేయనివారికి మాత్రం అమ్మ సాన్నిధ్యంలో వారి మనసు 'అమ్మ' అద్భుత రూపం మీద అసదృశమయిన అమ్మ సంభాషణల మీద కేంద్రీకృతమౌతుంది. ఏయే పనిపాటల్లో నిమగ్నమై ఉన్నా సర్వదా స్మరించే అమ్మ నామం వారిలో ఎప్పుడయినా కలిగే మనశ్చాంచల్యాన్ని అదుపులో పెడ్తుంది.

అమ్మ సాన్నిధ్యంలో ఒక్కొక్క వ్యక్తిత్వంలోని వ్యసనశీలతాదోషాలు క్రమంగా మారటం చాలామందికి అనుభూతమయిన విషయం. దుష్ట సంస్కారాల ఉద్ధృతి మాత్రం సడలిపోతుంది. సర్వమత సత్య స్వరూపం స్వచ్ఛంగా అమ్మలో చూడగలగటంలో అమ్మ దైవత్వాన్ని శంకించేవారూ క్రమంగా మారుతూంటారు. అమ్మలో ప్రకటితమయే పూర్ణ జ్ఞానమూ, పూర్తి నిరాడంబరతా ఎదుటివాడి అతిశయానికి భిన్నంగా ప్రస్ఫుటమై వినయశీలతను ప్రసాదిస్తుంది. అమ్మ సాన్నిధ్యంలో అహంకారంతో చేసే వాదోపవాదాలు అమ్మ తర్కంతో నశించి, అమ్మ ఎదురు ప్రశ్నలతో తన భ్రామికమైన ఊహాపరిధులు పటాపంచలైపోగా నిస్సహాయులవుతారు. అమ్మ ఎదుటివ్యక్తి అతిశయాన్ని ఎంతో సూక్ష్మంగా అదృశ్యంగా దెబ్బతీస్తుంది. గర్వి అయిన సంగీత విద్వాంసుడు అమ్మ సాన్నిధ్యంలో నైపుణ్య ప్రదర్శనం చేయలేక పోతాడు. ఉన్న పళాన కర్పూరాన్ని బండ శర్కరలను తెప్పించే సాధువులు అది అల్పవిద్య అని బోధింపబడి తరలిపోతారు. అమ్మ ప్రశ్నలకూ, జవాబులకూ పండితులమనుకునే వారు అటు యిటు పలాయనం చిత్తగిస్తారు.

## 18. అంతర్విప్లవం

జిల్లెళ్ళమూడి ప్రప్రథమంగా దర్శించటంతో అమ్మయొక్క అదృశ్యోపదేశం మనకు ప్రాప్తిస్తుంది. అమ్మ సాన్నిధ్యంలో కొద్దో గొప్పో కాలం గడపటంతో అంతరంగ శాంతి, కన్నీటి దివ్యత్వం ప్రాప్తిస్తాయి. ఈ రెండు అనుభవాలు వ్యక్తిజీవనంలో ఒక మలుపు తెచ్చి, భౌతికంగా అమ్మ సాన్నిధ్యానికి దగ్గరగా ఉన్నా ఉండకపోయినా హృదయంలో సూక్ష్మమైన అంతర్విప్లవానికి నాందీ ప్రస్తావన జరుగుతుంది. అమ్మ భౌతికకాయం ఏ పరమాత్మకు దృశ్యమానమయిన అవతారంగా ఉన్నదో దానికీ ప్రతి వ్యక్తికీ విడదీయరాని బంధాన్ని ఏర్పరుస్తుంది. తరువాతనైనా, సుదూరతీరాలలో ఉంటూ అమ్మ స్థూలంగా దూరమయినా నిరంతరం అమ్మ సాన్నిధ్యాన్ని లీలగా అనుభవిస్తూ, కనీసం అమ్మ భావనామాత్రంగానైనా వారి మనసుల్లో మెదులతూ వారి అన్ని ఆలోచనలకు ప్రాతిపదికయై ఉందని భావిస్తారు. ఆ సాన్నిధ్యస్ఫురణ అకర్మణ్యమూ, నిశ్చేతనమూ మాత్రం కాదు. అది సూక్ష్మమూ సూక్ష్మంగా ప్రతిభావంతమూను, దాని కార్యక్రమం అతి త్వరితగతిని తిరుగుతూన్న సమతలం వలె పైకి స్తబ్ధత కనపరుస్తూంటుంది. అన్ని ఆలోచనలు, భావనలు, ఊహలు ఆ స్ఫురణకు ఆకర్షింపబడటంతో, వ్యక్తి జీవితం ఒక క్రొత్త పంథా. ఒక క్రొత్త రూపం స్వీకరిస్తుంది.

జిల్లెళ్ళమూడి ప్రథమ దర్శనమయి తిరిగి వచ్చినాక అమ్మ స్వరూపం, అమ్మ మాటలు హావభావాలు సాన్నిధ్యంలో అనుభవించిన మనశ్శాంతి మనస్సుపై చెరగని

ముద్ర వేస్తాయి. అంతేకాదు ఆ బీజం వేరు పాదుకుని పెరిగి వినూత్నమైన అనుభవంతో హృదయస్థం అవుతుంది. "నన్ను శరణుజొచ్చిన వారితో నా సమాధి మాట్లాడుతుంది. నా సమాధి వారి వెంట వుంటుంద"న్న సాయిబాబా సూక్తుల సంపూర్ణభావాన్ని ఈ పైవిషయం నేను తెలుసుకున్న తర్వాత అవగాహన చేసుకున్నాను. "నేను నిర్యాణమయినాక అయినా సరే నన్ను ఎక్కడైనా తలచిన మరుక్షణం వారితో ఉంటా"నన్నారు ఆయన. రమణ భగవానులు "సజ్జనులు, జ్ఞానుల సాంగత్యం మనస్సును హృదయగతం చేస్తుంది. ఆ సాంగత్యము భౌతికమూ, మానసికమూ అయివుంటుంది. గురువు సాకారస్వరూపం, మనస్సు నంతర్ముఖం చేస్తుంది. జిజ్ఞాసువు హృదయంలో సుప్రతిష్ఠితుడై గురువు అంతర్ముఖమయిన మనస్సును హృదయగతం చేస్తాడు." అన్నారు. కాలం గడచేకొద్దీ ఈ ప్రాపంచిక బంధాలన్నీ విడిపోయి అమ్మతో మనస్సాంగత్యం పెరుగుతుంది. వ్యక్తిగత, అధికారిక జీవనంలోని ఈర్ష్యాసూయలు పరితాపాలు నిర్జీవమై, ప్రపంచంతో మానసికంగా అతిస్వల్పమైన పరిచయం నిలుపుకొంటాడు. పరిస్థితుల ప్రాబల్యం వల్ల తను తరచు మాతృశ్రీ చరణ సందర్శన భాగ్యానికి నోచుకోలేక పోతున్నానని విచారిస్తున్న బిడ్డతో అమ్మ **"శరీరం ఎక్కడుంటే ఏం నాన్నా ! మనస్సు ఇక్కడుంటే చాలు. ధ్యాసయే ధ్యానం"** అన్న మాట ఈ మార్పుకు ఊతమిస్తుంది. సాధనా మార్గంలో ఈ అప్రయత్నమైన అసంకల్పితమైన ప్రగతిని అమ్మ సూచిస్తూ "సాధ్యమయినదే గదా సాధన" అన్నది. "ఆవేదనయే ఆరాధన" అని నిర్వచించింది. అమ్మను చూడాలని, అమ్మ సాన్నిధ్యంలో ఉండాలన్న తీవ్రవాంఛ, దర్శించలేని నిస్సహాయత్వంతో ద్విగుణీకృతమై ఆవేదన ప్రాదుర్భవిస్తుంది. అమ్మ సాన్నిధ్యంలో అనుభవించిన శాంత్యానందాల కొరకై పడే తీవ్రపరితాప మే ఈ ఆవేదన.

ఈ శాంతి, ఆనందాలే ముక్తి స్వభావాన్ని విశదపరుస్తాయని చెపుతారు. **"ముముక్షుత్వమేమోక్ష"**మన్నది అమ్మ. ప్రాపంచిక విషయాసక్తి నశిస్తేనే ఈ ముముక్షుత్వం ప్రాప్తిస్తుందనీ, ఈ ముముక్షుత్వ స్వీయానుభవమే ముక్తి మార్గాన్ని సుగమం చేస్తుందని అమ్మ భావం. అమ్మ నారాధించే ఏ బిడ్డ విషయమైనా అంతే! అమ్మ సాన్నిధ్యంలో శాశ్వతంగా శాంత్యానంద ప్రద జీవనం గడపాలన్న తీవ్రవాంఛతో ప్రాపంచిక విషయాసక్తి నుండి విముక్తుడౌతాడు. ముక్తి పథంలో రూఢిగా పయనిస్తాడు. అమ్మ సాన్నిధ్యంలో ఉండాలన్న ప్రగాఢ భావమే మనస్సు యితర కోర్కెలను అధిగమించేట్లు చేస్తుంది. వ్యక్తిత్వం వినయశీలమై, స్వీయ అసమగ్రత, కళ్ళకు కట్టినట్లై శ్రద్ధాళువుగా మారుతాడు.

ఏసుక్రీస్తు అందుకే యీవిధంగా ప్రకటించారు "ఆత్మ స్థైర్యంలో పేదలు అదృష్టవంతులు. వారిది స్వర్గ సామ్రాజ్యమే గనుక. విచారించే వాళ్లు అదృష్టవంతులు

ఆదరింపబడతారు గనుక. సత్రవర్తనాక్షుదార్తులు అదృష్టవంతులు వారి క్షుద తీరుతుంది గనుక."

అమ్మ సాన్నిధ్యంలోని ఆనందశాంతిస్రవంతిలో మునిగి తేలాలన్న చిరప్రవర్ధమానమైన ఈ క్షుత్పిపాస ఎంత బలవత్తరమయినదంటే వచ్చేవారు చాలా మంది భోగభాగ్యాలు వర్జించి జిల్లెళ్ళమూడిలో ఉండగలగటం కోసం ఇతఃపూర్వం అనుభవిస్తున్న గౌరవ సౌకర్యాలు వీడి ఆనందంతో ఎంత నిరాడంబర జీవనానికైనా, ఏపని చేయటానికైనా, ఎంత కష్టమనుభవించడానికైనా వెనుదీయరు. నిస్సంగత్వమంటే తెలియకనే. గమనిక లేకనే పరిత్యాగపు పరాకాష్ఠకు ఎంత రూఢిగా చేరుకుంటారు. బహుశః అమ్మ యిందుకేనేమో "స్థితులు పొందేవికాదు. ప్రసాదించబడేవి" అన్నది. అడగకపోతే అమ్మ అయినా పెట్టదన్న సామెతను **"బిడ్డ అవసరాన్ని గమనించి అడక్కుండా పెట్టేది తల్లి"** అని సవరించింది. అమ్మ ఈ ప్రకటనకు ప్రత్యక్షాధారాలు కూడా వున్నాయి. సర్వ రక్షణ సమర్ధమయిన అమ్మ అనుగ్రహమందే సర్వసమర్పణబుద్ధిని గలిగిన కొందరు అమ్మను కనీసం ఆధ్యాత్మిక ప్రగతినైనా కోరరు. కాని సర్వార్తిహరణమయిన అమ్మ అనుగ్రహం ఎరుగక లాంఛన ప్రాయంగా పారమార్థిక శ్రేయమర్థించే సత్రవర్తకుల మనుకునే సాధు సన్యాసులకన్న వీరే ఎక్కువగా శ్రేయోగాములవుతున్నారు. భగవంతుని ప్రత్యేకమైన కోర్కెలను తీర్చమని వేడినప్పటికంటె సర్వస్వార్పణ బుద్ధితో శరణు వేడినప్పుడే ఎక్కువ మేలుకలుగుతుంది. ప్రత్యేకమైన కోర్కెలు అహంకారాన్ని నిలిపి వుంచుతాయి. నీవే శరణ్యమన్నప్పుడు అహంకారం ఆత్మనిమజ్జనం అవుతుంది.

మనమెంత దూరంలో ఉన్నా అమ్మ పనిగట్టుకుని కావాలని మనలో ఈ అంతర్విప్లవాన్ని తెస్తుందనటానికి అమ్మ యిచ్చిన వాగ్ధానమే తార్కాణము.

**"అమ్మ నీవెన్నంటే ఉంది నాన్నా..... ....... నన్ను చూడటానికి నువ్వు రావాలి. నువ్వెక్కడున్నా నేను చూడగలను...... అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో ఈ నాలుగు గోడల మధ్య మంచం మీద కూర్చున్న అమ్మ అనేకాదు. దేనికయితే ఆదీ అంత్యమూలేదో, ఏది సర్వానికీ ఆదీ అంత్యమో అదీ అమ్మ."** భగవద్గీతలోని కృష్ణుని "నేనే సర్వజీవాళికి మొదలు, నేనే తుదిని" అన్న వాక్యంతో పోల్చండి.

మనలో మార్పు తెచ్చుకునే ప్రయత్నం మనం చేయకపోయినా, మార్పు తెమ్మని అమ్మని అర్థించకపోయినా ఈ అంతర్విప్లవాన్ని తెచ్చి అమ్మ ఎందుకు మనలను రక్షిస్తోంది? అమ్మ చెప్పలేదా **"అమ్మ రక్షించడం అన్నపదం సరియయింది కాదని రక్షణే తల్లి"** అని? అందుకే.

## 19. వెలుగు నీడలు

ప్రపంచంలో మనం చూచేదంతా వెలుగునీడల విలాసమే. మనం అనుభవించే జీవితమంతా సంతోషానికీ, విషాదానికీ, నమ్మకానికీ, అపనమ్మ కానికీ భయానికీ మధ్య దోబూచులాటలే. మనశ్శాంతకై, పరమార్థాన్ని మనం జరిపే అన్వేషణలోనూ అంతే.

జిల్లెళ్ళమూడికీ మనకూ ఏర్పడుతున్న అనుబంధంలో ఒక విచిత్ర ముంది. ప్రాథమిక దశలో మన జిల్లెళ్ళమూడి ప్రయాణాలలోనూ, జిల్లెళ్ళమూడిలో మన ఉనికిలోనూ కలిగే పులకరింతలు కొంత కాలానికి అంతరించి మనమొక నిశ్చలమూ. అపారమూ అయిన సముద్రం మధ్యకు చేరుకున్నట్లవుతుంది. ఇకమీద మనల్ని, క్రొత్తగా వచ్చిన వారినీ, అతిథులనూ చూచినట్లు చూడటం జరగదు. 'అందరిల్లు' లో మనమూ ఒకళ్ళ మవుతాం. అప్పుడిక వచ్చేవారికి స్వాగతం పలకటానికి వారిని కనిపెట్టి ఉండటానికీ వారి మాతృదర్శనం మధురం చేయటంలోనూ వారి జిల్లెళ్ళమూడి నివాసం సౌకర్యవంతం చేయటంలోనూ, తోటివారితో సహకరించే బాధ్యత మనపై పడుతుంది. పాలు మాన్పించే సమయం వచ్చేసరికి తల్లి అలవాటు తప్పించే పాపల పరిస్థితిలో మనం ఉంటాం. ఆ పరిణామదశలో దాని సాధకబాధకాలు దానికి ఉంటాయి. సాంఘిక దృక్పథంలో అదెంత నిజమో మనస్సీమలోనూ అంతే. అమ్మ సాన్నిధ్యానికి మనం క్రమంగా దూరమై క్రొత్తగా వచ్చి చేరే సోదరీ సోదరులు కూడా ఆ బాధాకరమైన దశ ననుభవించటం, మనమెక్కడ జారిపోయామో వారూ అక్కడే జారిపోవటం మన కొకరకంగా వినోదంగానే ఉంటుంది. అయితే ఆ నవ్వులో దాగిన విషాదం వెంటనే బాధిస్తుంది.

జిల్లెళ్ళమూడి ప్రథమ సందర్శనాలలో అమ్మ లాలనా పాలనా మనకు దక్కటం, దాంతో అందరూ మన నెంతో సమాదరించటం జరుగుతుంది. అమ్మ గది సోదరీ, సోదరులతో నిండిన సమయాల్లో క్రొత్త సోదర సమూహం వస్తే, అంతకుముందు అలవాటు పడిన వారు క్రొత్త వారికి చోటు ఈయవలసి వస్తుంది. క్రొత్త వారికి మాత్రం ఎక్కువకాలం అమ్మ సాన్నిధ్యాన్నిస్తూ, అమ్మ స్వయంగా వారిని పరామర్శిస్తుంది. ఎవరైనా తనకోసం బెరుకుగా ఎక్కడో దూరంగా నిరీక్షిస్తుంటే వారికోసం కబురుపంపి దర్శనమిస్తుంది.

మనమన యిళ్లలో మనలో ఏ విధమైన ప్రత్యేకతా లేకపోతే ఈ రకమైన ఆదరణ లభించదు. స్వాభావికమైన అణుకువ లోపించిన వారికి ఈ ప్రత్యేకమైన ఆదరణ లభిస్తే అమ్మ తనను ప్రత్యేకమైన దృష్టితో చూస్తున్నదని భావిస్తారు. దానితో వారిలోని అహంభావం తలెత్తుతుంది. ఆ పరిస్థితుల్లో ఉన్నవారు అమ్మ మాట విని

ఉండరు. లేదా గుర్తు అన్నా వుండివుండదు. **"అర్హత బట్టి మాట్లాడితే మీరెవ్వరూ ఏడవమైలు దాటి అడుగు కూడా పెట్టలేరమ్మా"** అని. పిల్లలు తప్పు చేసినా తల్లి ప్రేమిస్తూనే వుంటుంది. ఎందుకంటే తల్లికి తప్పే కనిపించదు కనుక. మనలో రేకెత్తే ఈ అహంభావం ప్రగతికి ప్రతిబంధకం గనుక నిరంతరం అనుభవించిన అమ్మసాన్నిధ్యానికి క్రమంగా దూరం చేయబడతాం.

నాకు ఈ విధానం బహుళార్థసాధకంగా ఉందనిపిస్తుంది. ప్రారంభంలో అమ్మ చూపించే ప్రత్యేకాదరణా, లాలనపాలనలు అనంతమైన మాతృప్రేమకు మనల్ని పరిచితుల్ని చేస్తాయి. మరచి పోదామన్నా మరపురానిదీ, మరెక్కడా పొందటానికి అశక్యమైనదీ అయిన ఈ హృదయంగమమైన అమ్మ ప్రేమ మనపై చెరగని ముద్రవేసింది. ఇది జరిగినాక ఇక ఆ విధంగా ఆదరించే అవసరం ఉండదు. మన వ్యక్తిత్వంలోని మనం తెలుసుకోలేనంతగా దాగిన దోషాలు ఈ విధానంతో బయటబడతాయి. మొట్టమొదటిసారిగా క్రొత్తవారికి చోటు ఈయమని మనను బయటకు పంపినప్పుడు పూర్వంలాగా అమ్మ తన యందు ప్రత్యేక శ్రద్ధచూపటం లేదనీ, సమయమంతా యితరులతోనే ముచ్చటిస్తోందనీ దురభిప్రాయపడతాం. ఇదంతా చూస్తే ఏసుక్రీస్తు చెప్పిన కథ ఒకటిగుర్తు వస్తున్నది నాకు.

ఒక తండ్రి తన యిద్దరు కుమారులకు ఆస్తి సమంగా పంచి యిస్తాడు. ఒకడు చక్కగా ఆస్తిపాస్తులు నిర్వహిస్తూ తండ్రి చెంతనే ఉంటాడు. రెండవవాడు తండ్రిని వదలిపోయి ఆస్తి సర్వనాశనం చేసి వట్టిచేతులతో తండ్రి దగ్గరకు తిరిగి వస్తాడు. తండ్రి ఆ కొడుకు రావటం చూసి పరుగు పరుగున ఎదురు వెళ్లి కౌగలించుకుని లోపలకు తెస్తాడు. అతని రాకకు పండుగ చేస్తాడు. తనలోని నీతి నిజాయితీలకు నైపుణ్యానికీ తన తండ్రి ఎన్నడూ యింతటి సంతోషాన్ని ప్రదర్శించలేదనీ మొదటివాడు బాధపడుతాడు. తండ్రిని నిరసిస్తాడు. ఇది త్రోవ తప్పిపోయిన కొడుకు తిరిగి వచ్చిన సంతోషమనీ నాకున్నదంతా నీకే గదా అని మొదటివాడికి వివరిస్తాడు తండ్రి.

విశ్వకుటుంబంతో మనం తాదాత్మ్యం చెందామని ఆ రకంగా అమ్మకు మరింత దగ్గర అయినామనీ గ్రహించటం అంత తేలికకాదు. నిరంతరం అనుభవించిన అమ్మ సాన్నిధ్యానికి దూరమైన వారు ఈ విషయం అవగాహన చేసుకోవటానికి కొంత సమయం పడుతుంది. యింట్లో వాళ్లకి చూపించే గౌరవాదరాలకీ, అతిథులకిచ్చే గౌరవాదరాలకీ తేడా ఉంటుంది కదా !

పరిణామగతమైన ఈ అనుభవం మనస్సు లోతుకు తగుల్తుంది. ఇక్కడికి వచ్చి ఉన్నంత మాత్రాన ప్రయోజనమేమిటి ? – నా ఆధ్యాత్మిక జీవనంలోని ప్రగతి

తాత్కాలికమై, అదృశ్యమవటం లేదా ? అని ప్రశ్నించుకుంటారు. అమ్మ మనకు పరిపూర్ణత్వం సిద్ధిస్తుందని ఎందుకు హామీ నివ్వదు ? అనిపిస్తుంది.

సూక్ష్మంగా ఆత్మపరిశీలన చేస్తే జిల్లెళ్ళమూడిలో మనమున్న కాలంలో మనలో మార్పు ఉంటుంది. మనస్సుకు మరింత ప్రశాంతి లభిస్తుంది. అనూహ్యంగా మన మేధస్సుకు దివ్యతటిల్లతలు గోచరిస్తాయి. హృదయం సర్వతోముఖంగా దయార్ద్ర మవుతుంది. మనస్సులో కోర్కెలపై తాపత్రయం తగ్గుతుంది. ధ్యాననిష్ఠ పెరుగుతుంది. జిల్లెళ్ళమూడిలో సుదీర్ఘంగా ఉన్న తర్వాత మనలో కలిగే ఈ దివ్యోన్నత జీవన వికాసం మన సహజ గుణాన్ని తేటతెల్లం చేస్తుంది. కానీ జిల్లెళ్ళమూడి దాటి అడుగు పెడితే సరి మన మనుభవించిన స్వీయదివ్యత్వం పొగమంచులాగా కరిగిపోయి మనలో లోటు పాట్లు కొట్టువచ్చినట్లు కనపడుతూ నిర్దాక్షిణ్యమైన ఆత్మ పరిశీలన మిగులుతుంది. ఈ అనుభవం మనకు చర్వితచర్వణమయే సరికి ఇక్కడికి వచ్చినందువల్ల శాశ్వత ప్రయోజనం. మారని వికాసం రానేరాదా ? అన్న అనుమానం కలుగక మానదు. నాకూ అలాగే అనిపించి కన్నీళ్ల పర్యంతమౌతూ అమ్మనడిగితే **"నీలో మార్పు లేదని నీకెట్లా తెలుసు** ? మార్పు పరిపూర్ణమయినప్పుడు నీ పూర్వస్థితి నీకు అంతగా గుర్తుండదు. ఇప్పటి నీవున్నస్థితిలోనే యింతకుముందు కూడా ఉంటూవచ్చావని పిస్తుంది. **నిజమైన పరిణామం గమనించలేనిది"** అని చెప్పింది. ఇప్పుడొక్కసారి వెను దిరిగి చూస్తే ఇటువంటి సందేహానికే. అమ్మ **"జిల్లెళ్ళమూడి గడ్డమీద పెట్టిన అడుగు వృథా పోదు"** అని చెప్పిన సమాధానం గుర్తుకు వస్తోంది.

నా ఈ మనోవ్యధను మరోసారి అమ్మ ముందు ఉంచటం నా అవివేకమే అయింది. "ఇక్కడకు వచ్చినందువల్ల ఏ మాత్రం ప్రయోజనం లేదని నీ వనుకునేట్లయితే నీవు రాబోకు" అని నీరసమైన జవాబు నిచ్చింది. నాకు నోటమాట రాలేదు. ఈ తీవ్రాఘాతానికి కలవరపడ్డాను. రాకుండా వుండటానికి పెనుగులాడాను. సంవత్సరాలు గతించినాక సాధ్యమయినంత తరచుగా నేను జిల్లెళ్ళమూడి రావటం, సాధ్యమయినంత కాలం ఉండటం గమనిస్తున్నాను.

"నిజంగా రావటం వృథా అయితే నువ్వు వస్తూండవు. ఏదో శాంతి, సంతోషం అనునయం పొందుతున్నావు. దాని కోసం నువ్వు వస్తున్నావు. ఆ ప్రయోజనమయినా తీరింది కదా ! అంతర్గతమైన విషయాలలో శాశ్వతపరిణామన్ని కోరుతున్నావా ? అయితే పూర్వం అనుభూతమైన విషయం గురించి ప్రస్తావిస్తున్నావు. ఎవరో మాట్లాడుతుంటే వినో పుస్తకాలలో చదవటం వలననో అడుగుతున్నావు. నీకా విషయం నిజంగా తెలియదు. నీవు ఆ శాశ్వత పరిణామ పథంలో పురోగమిస్తున్నావో లేవో నిర్ణయించుకునేందుకు నీ కాధారమేముంది ? దాని గురించి బాధపడకు. ప్రతిదీనీ

దాని తరుణంలో అది వస్తుంది" అని అమ్మ ఒకసారి చెప్పింది. అమ్మ చెప్పిన దంతా సందిగ్ధంగా దిగమ్రింగాను.

కొంతకాలానికి ఇట్టి ప్రశ్నకే రమణమహర్షి యిచ్చిన సమాధానం పై విధంగానే ఉందని గమనించాను నా కిది ధైర్యాన్నిచ్చింది. అమ్మను సమీపించి నా విధానంలో అన్ని అనుమానాలూ, భయాలూ నా కున్నయని అంగీకరిస్తాను. అందుకే ఎప్పుడూ ఇతర మహర్షుల ఉపదేశాలతో అమ్మ మాటలు సరిపోల్చుకుంటాను. అయినప్పటికీ అమ్మ సాన్నిధ్యానికి ఎప్పుడు వీలయితే అప్పుడు చేరటానికి వేగిరపడుతుంటాను.

నమ్మకం భగవంతునితో మననెంతగా బంధించి వుంచుతుందో అపనమ్మకమూ అంతగానే బంధించి వుంచుతుందనీ, అపనమ్మకం తరచు నమ్మకాని కొక తొడుగు మాత్రమేననీ నాకు అనిపిస్తుంటుంది.

## ౨౦. అనుబంధాలు - అమ్మ

వ్యక్తిగతమైన అనుబంధాలు బంధనకు కారణమనీ, మోక్షసాధనకు వీటి అస్తిత్వం ఆటంకమవుతున్నదనీ తరచు భావింపబడుతున్నది. ఇట్టి దృక్పథం తోటి మానవులంటే మానవుని హృదయంలో గల ఆర్ద్రతా, అనురాగాలను నశింపజేసేందుకు ఉద్యుక్తమవుతున్నది. మానవుని మానవుడు ద్వేషించకుండాను, కనికరం కలవానిగాను ఈ ప్రేమార్ద్రతలు మనిషిని నిలుపుతాయి. ఈ అనుబంధాలు కూడదన్న దురభిప్రాయమే మానవునిలోగల నిర్దాక్షిణ్య ప్రవృత్తికీ సంకుచితమూఢవిశ్వాసాలకూ, కులవిభేదాలకూ కారణం. చాందసవిద్వాంసుల మానసంలో తమ జపతపాదుల గూర్చిన చింతయే గాని ఆకలితో అలమటిస్తున్న దప్పికతో తల్లడిల్లుతున్న ఒక్క శూద్రుని రక్షించాలన్న తలంపేరాదు. మైలపడిపోతామనే భావంతో చనిపోతున్న తోటి మానవునికి సైతం ముఖం తప్పిస్తూంటారట్టివాళ్ళు.

అమ్మ మాటలు ఈ మానవసంబంధ బాంధవ్యాలను గురించిన దురభి ప్రాయాలను పారద్రోలుతాయి. ఆధ్యాత్మిక సాధనకు గమ్యమైన సకల చరాచర జీవరాసులలోను దైవత్వాన్ని చూడటమనే ప్రక్రియకు స్వచ్ఛమైన అనుబంధాలు సహాయ భూతాలు అంటారు అమ్మ. శ్రీరామకృష్ణపరమహంస బోధించింది యిదే. స్వామి వివేకానందులు ఈ హైందవసమాజంలో అవిరళకృషి జరిపి సుప్రతిష్ఠితం చేయదలచిందీ యిదే. ఈ సత్యమే గాంధీమహాత్ముడు చెప్పింది. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ - సకలచరాచరజీవరాసులలో తననూ, తనలో సకలచరాచర జీవరాసులనూ జ్ఞానులు దర్శిస్తారనీ, జ్ఞానులు పశుపక్ష్యాదులనూ, శూద్రకుల సంజాతులనూ విప్రవరులనూ సమదృష్టితోనే చూస్తారనీ - చేసిన ఉపదేశం పై మహనీయుల జ్ఞానసంపత్తికి గీటురాయి. సరియైన విధంగా మలచుకుంటే ఈ

**అనుబంధాలు దివ్యజ్ఞాన సముపార్జనకు ఆటంకం కావనీ పైపెచ్చు సాధనోపకరణాలనీ** అమ్మ చెప్పటం ఆశ్చర్యకరం కాదు.

"పరిపూర్ణతను పొందటానికి ఉత్తమ సాధన ఏది ?" అని అమ్మ నడిగే రొకరు. "**శ్రద్ధగా చేసిన ప్రతిదీ సాధనయే**" నన్నది అమ్మ. "**మీరేం సాధన చేస్తారు?**" మరొకరి ప్రశ్న. "పిల్లల్ని కనటం – వాళ్ళని పెంచటం" అని సమాధానం. "ఉత్తమమైన పూజావిధానమేది" అని యింకొకరు ప్రశ్నిస్తే "బరువుబాధ్యతలు వహిస్తూ నీ అవసరాలు చూచేదీ నీ భర్త. సర్వాన్ని రక్షిస్తూన్న దైవం భర్తయే నన్న దృష్టితో చూడు. అదే అత్యంత సులభమైన సాధన. భర్త కే పరిచర్యలు చేసినా ఆ పరమేశ్వరునికే చేస్తున్నంత విశ్వాసంతో చేయి. నీ వైవాహిక జీవనంలో కష్టాలెదురైతే అవి నీ సహనానికీ, సాత్వికతకూ, భూతదయకూ శిక్షణగానే భావించు. నీవు పసిబిడ్డను సాకేటప్పుడు బాలకృష్ణుడనే దృక్పథంతోనే చూడు. ఆ దృక్పథంతోనే పెంచు ఆ రకంగా గృహస్థ జీవితమంతా అనిరతమైన విశుద్ధమైన సాధనగా మారుతుంది. అరణ్యాల్లోకి పోయి కళ్లుమూసుకొని ఊపిరి నిలపటం ఇంతకన్న గొప్పసాధనేంకాదు". "**సర్వత్రా మంచిని చూడడమే మనలో మంచితనం**" అన్నమాట అమ్మ మానవానుబంధాలను గురించి చెప్పిన తత్వానికి ప్రాతిపదిక.

ఈ సంబంధ బాంధవ్యాలలో సరియైన స్వరూపమేది ? భార్యాభర్తల అనుబంధం యొక్క పవిత్రరూపమేది ? ఆదర్శస్నేహం ఎలా ఉంటుంది ? ఇటువంటి అనుబంధాలను గురించి అమ్మ తన భావాలు విశదం చేసింది.

ఒకరోజు ఒక జంట యొక్క అన్యోన్యమైన దాంపత్యం గురించి అమ్మ ఎదుట ప్రశంసించారొకరు. అమ్మ వెంటనే వారి బాంధవ్యం తనకంత తృప్తికరంగా లేదన్నది. "అట్లయితే ఎలా ఉంటే ఆదర్శదాంపత్యజీవనమౌతుందో చెప్ప"మని అమ్మను అడిగారు మరొకరు. పరోక్షంగా ఆజంట నుద్దేశిస్తూ అమ్మ సమాధానం చెప్పింది ఈ క్రింది విధంగా.

"అన్యోన్య దాంపత్యంలో పరస్పర గౌరవం ఉండాలి. ఏ అనుబంధంలోనైనా నిజమైన మర్యాద, మన్నన ఉన్నవీ అని అంటే – అక్కడ నిరంతరమూ భౌతికమైన సాన్నిధ్యంలో ఉండాలన్న నియమేమీ లేదు. అది సంకేతమూ కాదు. తల్లీబిడ్డల యందు గాని, సోదరీసోదరులందుగాని, భార్యాభర్తలయందు గాని మనసులో యధార్థమైన గౌరవాదరాలుంటే చాలు. వారు గౌరవంగా సముచితంగా వ్యవహరించినంత వరకూ కలసి ఉండవచ్చు – కలిసి నిద్రించవచ్చు కూడా. కానీ మేమే భార్యాభర్తల మన్నట్లుగా, ఓ పెద్ద ఘనకార్యంలాగా, ప్రపంచానికంతా చాటి చెప్తున్నట్లుగా ప్రవర్తించటం నాకు నచ్చదు.

వారి వారి విద్యుక్త ధర్మాలను వారు నిర్వర్తించవలసిందే. భర్త ప్రపంచంలో జొరబడి శ్రమించి జీవనోపాధి గడించవలసిందే. భార్య యింట్లో ఉండి వంటా వార్పూ చూసుకుంటూ ఇతర సంసార బాధ్యతలు నిర్వర్తించకోవలసిందే. భార్యను సహధర్మచారిణి అన్నారు. ఈ గృహస్థ ధర్మాలను త్రోసిరాజంటే వారికి ఉండవలసిన ప్రవృత్తియే దూరమౌతుంది.

కష్టసుఖాలు రెంటినీ స్వీకరించే విధంగా భర్త భార్యకు నేర్పాలి. కష్టాలను ఇదే సుఖమనుకొని స్వీకరించే సత్తువ నామె కందించాలి భర్త. అసలు భార్య కించిత్తు కష్టం కూడా పడకుండా చూడాలని భర్త చేసే పనులను నేను సమ్మతించను. ఒకరోజు ఒకతను తన భార్యను సంతృప్తిపరచే దృష్టితో పిల్లలనందరినీ వెంట తీసుకొని పోయి ఆమె ముందు కూర్చున్నాడు. అటు వంటి పనులే నాకిష్టముండవు. దూరంగా యింకో గదిలో కూర్చుంటే ఆమెకు సంతృప్తి కలగదని ఈయన భావించి ఉంటాడు. ఈయనే యిటువంటి విషయాలు భార్యకు అలవాటు చేసేది. రోగగ్రస్తులమయినప్పుడు పంచనచేరి పరిచర్య చేయవలసిందే కాని ఇంత భార్యాలోలత్వం తగదు – ఎప్పుడూ భార్య అడుగులకు మడుగులొత్తుతూ ఉండటం అంత మంచిపనికాదు. ఈ రోజులలో దంపతులమధ్య పరిచయమూ, స్నేహమూ మాత్రమే ఉన్నవనిపిస్తుంది. భయమూ, భక్తీ, గౌరవమూ కనపడవు."

ఇంతలో ఎవరో అడిగారు. "దంపతుల మధ్య స్నేహం ఉండకూడదా ?" అని.

"ఉండవచ్చు – కానీ హద్దుల్లో ఉండాలి. ఆ స్నేహం వారి హృదయాల్లోని భక్తినీ గౌరవాన్నీ పెరికి వేసేంత ఉండరాదు. అదే జరిగితే ఆ అనుబంధం స్నేహమని అనిపించుకోవటానికి కూడా తగదు. ఆకలి తీర్చుకునేందుకు ఆహారం ఉన్నట్లు వారి అవసరాలుల తీర్చుకునేందుకు వారు కలిసి ఉన్నట్లుంటుంది. నేటి కాలంలో దాంపత్య బంధానికి వారి భౌతిక వాంఛాపరితృప్తి కన్న మించిన పరిమాశయం లేనట్లు తోస్తుంది."

దాంపత్య జీవనంలో అమ్మ ఉద్దేశించిన పరమాశయం ఏమిటి ? అమ్మ చెప్పిన దాన్ని బట్టి, వ్యవహరించే తీరునుబట్టి అమ్మ అభిప్రాయాలు అవగతమౌతాయి. ఏ గుడిలోనో విగ్రహం ఎదుటో గాక దైవత్వమే మూర్తీభవించిన అమ్మ సన్నిధిలో వివాహం చేసుకోవటం శుభంగా భావిస్తారు చాలామంది. ఆ సందర్భాలలో అమ్మ సాక్షిమాత్రంగా కాక ఆ తతంగంలో ఉత్సాహంగా పాల్గొని ప్రత్యక్షంగా ఆయా కర్మకాండలలోని నిజమైన ప్రాధాన్యతను తెలియజెపుతున్నట్లుగా ప్రత్యంశమూ జరిపిస్తూ మానవజీవితంలో వివాహం యొక్క నిగూఢ ప్రయోజనాన్ని ప్రకటిస్తుంది.

1.6.1963 వ తేదీ రాత్రి పదిగంటల సమయంలో పెళ్ళి వారంతా వచ్చారు.

వారు ఆలస్యంగా రావటంతో అప్పటి వరకూ ఉన్న పురోహితుడు వెళ్ళిపోయాడు. మంగళ తూర్యారావాలతో పాటు నామసంకీర్తనం జరుగుతుండగా, స్నానం ముగించి సందర్భోచితమైన సర్వాలంకారాలతో వేదిక నలంకరించి అమ్మ. వివాహం జరిపించే 'వశిష్ఠ'ని కంటే మిన్నగా తానే వశిష్ఠబ్రహ్మ పాత్ర వహించింది. విశదంగా అన్ని వివాహప్రక్రియలు సమగ్రంగా జరిపినాక మంగళసూత్ర ధారణానంతరం వధూవరులను నిరువురనూ పరస్పరం పూజింపజేసింది. చివరకు వధువుచే వరుని పాదాభివందనం చేయించింది. వారు తన నుండి వీడ్కోలు పొందేటప్పుడు తాను భార్యను పూజించిన విషయం భర్తకు గుర్తు చేసింది. వివాహంలోని పరమాశయం మోక్షప్రాప్తికి సాధనంగా యిక్కడ సూచితమైంది. ఏకమైన ఆత్మకు ప్రత్యక్ష స్వరూపాలే వధూవరులు. వారి ఏకత్వపు పరాకాష్ఠ దైవత్వంలోనేనని గుర్తిస్తూ, ఒకరినొకరు ఆ శక్తి అపరావతారంగా పరస్పరమూ సేవించటం వారి ఆశయంగా ఉండాలి. ఈ దృక్పథం ఆత్మసాక్షాత్కారానికి దారితీస్తూ భౌతికంగా అన్యోన్యతను ఏకాత్మతను స్థిరపరుస్తుంది. ఇదే పాతివ్రత్యంలోని, ఏకపత్నీవ్రతంలోని నిజమైన సారాంశం అని చెప్పింది అమ్మ. పసుపుతాడు భార్యకు అందున్న బంగారపు బొట్లు భర్త పాదద్వంద్వానికి సంకేతంకాగా మంగళసూత్రం అర్థనారీశ్వరత్వానికి సంకేతమట ! మూడుముళ్లు వేయటం అంటే త్రిపుటీ స్వరూపమైన సృష్టిలో వారి నేకీకృతం చేస్తున్నదని చిహ్నితం. శిష్టాచారులైన పండితులకు వరుడు వధువును పూజించటం ఆశ్చర్యకరంకావచ్చు కానీ బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞ్యవల్క్య మహర్షి "భర్త భార్యను ప్రేమించేది భార్య అని కాదు ఆత్మస్వరూపంగా ప్రేమిస్తా"డని చెప్పలేదా !

కొందరు వితంతువులతో అమ్మ ఒకసారి చెప్పింది "నా దృష్టిలో వితంతువే లేదు. భౌతికంగా భర్త తన ఎదుట ఉండకపోవచ్చు. కానీ భర్తచరణాలు ఆమెకు గుర్తున్నంతకాలం ఆమె ముత్తయిదువే." బాల్యంలోనే వైధవ్యం పొందిన ఒక స్త్రీ "అమ్మా వారి రూపం కూడా తెలియనంత చిన్నతములోనే విగత భర్తృకలయిన నాబోటి వారి విషయమేంటి ?" అని అడిగితే "నీకు వివాహం చేసుకున్నానీ, నాకో భర్త ఉన్నాడనీ గుర్తుఉన్నది కదా ! ఆ భావం పచ్చగా ఉంచుకుని దాన్ని జపించు, రూపాన్ని ధ్యానించేవారు ఏధి సాధించగలరో భావాన్ని ఆరాధించేవారు కూడా దాన్నే సాధించవచ్చు. (ఒక రూపమందు గాని, ఒక భావమందుగాని) ధ్యాసయే ధ్యానం" అని ధైర్యం చెప్పింది.

అమ్మ అనుదినమూ మంగళసూత్రాల నభిషేకించి ఆ తీర్థం స్వీకరించటం అందరికీ తెలిసిన విషయమే. దానివల్ల అమ్మ సంపూర్ణతను పొందాలని ఆశించటం కాదు. అమ్మ జన్మతః పరిపూర్ణస్వరూపమే. గీతలో భగవానుడు చెప్పినట్లు పరమాత్మ

స్వరూపులయిన వారు వారి కోసం కాకపోయినా ఇతరులకు మార్గదర్శకంగా ఉండేందుకే నియమాల్నీ, ధర్మాల్నీ పాటిస్తూంటారు. 'పసుపుతాడు, బంగారుబొట్లు ఏం చెపుతాయి ? అని అమ్మ తననుతానే ప్రశ్నించు కొని సమాధానం చెప్పింది. "బొట్లు భర్తపాదాలు, అవి నీ కంఠాన కట్టి వుంచుతున్నాడంటే శాశ్వతంగా తన పాదాల్ని నీతో బందించి ఉంచుతున్నాడన్నమాట. ఎక్కడన్నా ఉండనీ, ఏమన్నా చేయనీ - నీ హృదయంలో అతని పాదాలు సర్వదా ఉన్నాయి. ముక్తిసాధన కింతకన్న సుకరమైన దేమున్నది స్త్రీలకు ? స్త్రీకి భర్త మానవరూపంలో భగవంతుడు. ఆ విశ్వాసమే ముక్తిని పొందేందుకు అత్యంతసులభమైన సాధనం. మనస్సులో కనబడని భగవంతుని గూర్చి రూపమేర్పరచుకోవటం. అరణ్యాల్లో తపస్సు చేయటం - అణచి వేయబడ్డ కోర్కెల విప్లవానికి తలవంచటం - ఇవేవీలేవు. సామాన్య గృహిణి సాధించగలిగినట్లు ఒక ముని కూడా సాధించలేడు. ఆమెకు ప్రత్యేకించి సాధనగాని మంత్రంగాని అవసరం లేదు."

ఎంతమందినో ముక్తికి ప్రతిబంధకమేమో అని భయపెడ్తున్న ఈ దాంపత్య బాంధవ్యాన్ని మోక్షప్రాప్తికి సహకరించేదిగా మార్చుకోవచ్చు.

## 21. అద్భుతాలు - అమ్మ

అమ్మ ఒకసారి అన్నది "ముక్తి పొందేది కాదు. నిర్ణీతమైన తరుణంలో దైవసంకల్పంచేత అనుగ్రహింపబడుతుంది. ఆ క్షణం వచ్చినప్పుడు ముక్తిని పొందేందుకు కావలసిన అర్హత కూడా దానంతట అదే వస్తుంది. అర్హత అనేది కూడా పొందేదికాదు. ఈ విషయం తెలియనివారికి మానవ ప్రయత్నం వలననే ఇది సాధ్యపడుతున్న దనిపిస్తుంది."

నే నన్నాను "ప్రతి చిన్నవిషయమూ పూర్వమే అంతానిర్ధారణ అయిపోయి అంత మార్చలేనిదే అయితే జరుగుతున్న అద్భుతాలకి అర్థమేమిటి ? మహర్షులు, ప్రవక్తలు మరణించినవారిని పునరుజ్జీవింప చేయలేదా ? ఆ దైవసంకల్పం కూడా అప్పుడప్పుడు మానవరూపంలో ఆవిష్కరిస్తూ ఉంటుందంటారు. ఆ దైవసంకల్పం తన నిర్ణయాన్ని తాను తప్పక మార్చగలిగి తీరుతుంది. లేకపోతే అది సర్వోత్కృష్టమే కాదు." అమ్మ అన్నారు.

"దైవసంకల్పం తన నిర్ణయాన్ని మార్చగలదు. తాను కావాలనుకున్నప్పుడే అలా జరిగేది. తన సంకల్పం తాను మార్చుకోగోరితే అది సంకల్పమే కాదు - సర్వోత్కృష్టమూకాదు. మనకు లాగే ఒక కల్పన అవుతుంది. నీవు చెప్పే అద్భుతాలు అద్భుతాలే కాదు నా దృష్టిలో. సృష్టికి మించిన అద్భుతమేముంటుంది ? అద్భుతాలనబడే ఆయా సంఘటనలు కూడా ముందుగా నిర్ణయింపబడినవే. దైవం

యొక్క వివిధ అవతారాలు గూడా పూర్వం నిర్ణయమైనవే. దైవం అవతరించటం అనే విధానం సర్వమూ పూర్వమే నిర్ణయింపబడి ఉండటానికి సమగ్రత్వం చేకూరుస్తుంది. అందుకే ఆయా అవతార వ్యక్తుల కృత్యాలు కూడా పూర్వమే నిర్ణయమై ఉంటాయి."

ఏసుక్రీస్తు మరణించిన వారిని పునరుజ్జీవింపచేయలేదా ? మరి తను శిలువ కెరగాకుండా కాపాడుకోలేడా ? ఆ విధంగా జరిగిందీ అంటే ఆ రకంగా నిర్ణయమై ఉన్నదన్నమాట. తనను శిలువనుంచి తప్పించే ప్రయత్నం చేసిన వారితో క్రీస్తుప్రభువు అన్నారు – "ప్రభువును నే నిప్పుడు ప్రార్థిస్తే పన్నెండు దళాల సైన్యం యీయడని నీ వనుకుంటున్నావా ? బైబిలులో చెప్పినట్లు జరుగవద్దూ ? ఇది జరుగవలసిందే" అని. నవీన భారతావనిలో ఆవలీలగా చమత్కారాలు చేయగలిగిన మహనీయులలో సాయిబాబా ఒకరు. చమత్కారాల గురించి ఆయన యేం చెప్పారో గమనిద్దాం....

"నేనేం చమత్కారాలు చేయను. మీలో జ్యోతిష్కులున్నారు కదా ! నేనూ ఒకరకమైన జ్యోతిష్యుడనే. మీరు మాత్రం అర్థం చేసుకోరు. భవిష్యత్తు మీకు తెలియకపోవటం వలన నా మాటలు మీకు అద్భుతంగా కనుపిస్తాయి. జరుగుతున్న సంఘటనలు నా చమత్కారాలు చేసే శక్తికీ నైపుణ్యానికీ నిదర్శనగా భావిస్తారు. తన్మూలంగా నాపై భక్తిశ్రద్ధలు నిలుపుకుంటారు. ఆ భక్తి శ్రద్ధలను నేను భగవంతుని దిశకు త్రిప్పుతాను."

అద్భుతాలు చేసిన సమయానకూడా ఏసుక్రీస్తు తాను భగవత్సంకల్పానుసారంగా ప్రవర్తించినట్లు చెప్పటంవలన – పైమాటలలోని నిజం ఎంత ప్రస్ఫుట మౌతున్నదో !

జి.ఐ. గురిప్ అనే పాశ్చాత్య గురువు అద్భుతాలను గూర్చి ఏమన్నారో చూడండి.

"ఏ భగవత్సంకల్పం ప్రకృతి ధర్మాలను, నియమాలను ఏర్పరచిందో అదే శక్తి ఒక రకంగా ఆయాధర్మాలను నియమాలను ఉల్లంఘించటమే అద్భుతమని భావించటం సామాన్యమైన ఇంగితజ్ఞానానికి మాత్రమే విరుద్ధం కాక, సంకల్పమన్న భావానికీ కూడా విరుద్ధమే అవుతుంది. మానవులకు అతీతమైన ప్రకృతి ధర్మాల సమావిష్కారమై అద్భుత మనబడుతుంది." (ఓస్పెన్స్కీ In search of the Mirculous రచించిన )

మానవకోటి భగవంతుని ప్రార్థించిన సారాంశం "ప్రభూ ! రెండు రెండ్లు నాలుగు కాకుండా చేయమనే" నని ఎంతో సుందరంగా టర్జెనివ్ అనే తత్వవేత్త సూక్ష్మీకరించాడు. "మీ సమస్యల నెలా పరిష్కరించాలో నాకు తెలీదు" అనే అమ్మ విలక్షణమైన సమాధానంలోని కిటుకును పై మహనీయుల వాక్యాలు విపులీ కరిస్తాయి. తమ కెదురయ్యే సమస్యలూ, కష్టాలూ కూడా సుఖసంతోషాలవలెనే తన అనుగ్రహ ఫలంగా భావించమని పిల్లలకు చెపుతుంది అమ్మ.

అమ్మ సాన్నిధ్యంలో జరిగే అద్భుతాలు, తన సాన్నిధ్యంలో అనేకుల కనుభూత మయ్యే అద్భుతాల మాట ఏమిటి ? సిద్ధుల గురించి రమణ భగవానులేమన్నారో పరిశీలిస్తే ఈ విషయమూ విశదమౌతుంది. "అది దైవదత్తమైనవి. వాటంతట అవి జరుగుతూనే ఉంటాయి". అందుకే అనుకుంటాను బహుశ అమ్మ తాను అద్భుతాలను మాహాత్మ్యాలను చూపననటం. భక్తుల అద్భుతావహమైన అనుభవాలు వారి విశ్వాసం వలననేనని, లేదా భగవత్సంకల్పం వల్ల అలా జరుగుతున్నదని చెపుతూ మాహాత్మ్యాలను గూర్చిన తలంపులనే అమ్మ ఖండిస్తుంది. ముక్తిని పొందటం కూడా అమ్మకు అద్భుతావహం కాకపోవటంలో ఆశ్చర్యం లేదు మరి. ముక్తిని పొందాలన్న కోరిక, దానికి కాలసిన అర్హత, చివరికి ముక్తి కూడా సర్వానికి ఆధారభూతమైన భగవత్సంకల్పం అనుగ్రహించవలసిందే. 'ఆత్మ' సాక్షాత్కారం గురించిన రమణుల స్వీయానుభవం అమ్మ ప్రకటనను బలపరుస్తుంది.

"నే నేమీ నిత్య శంకితుణ్ణిగాను, జీవితం గురించి నాకేమీ తెలీదు. జీవితం దుఃఖమయమని కూడా నేను తెలుసుకోలేదు. పునర్జన్మనుంచి తప్పుకుందామని గాని, ముక్తిని ఆపేక్షించిగాని, వైరాగ్యాన్ని అలవరచుకుందామని గాని నేనే కోరికలతోనూ ప్రబుద్ధం కాలేదు. పెరియ పురాణం తప్ప నేనే గ్రంథమూ చదువలేదు. పరబ్రహ్మమూ, సంసారమూ మొదలైన వాటి గురించి గాని, సర్వత్రా అంతర్నిహితమైన అనిర్దేశ్యమయిన సత్యమున్నదనీ, అదే ఈశ్వరుడనీ, ... నాకు ఈశ్వరునికీ ఏకత్వమున్నదనీ ... ఇటువంటి విషయాలు నే నెప్పుడూ వినలేదు. తరువాత కాలంలో ఈ అరుణాచలంలో ఋభుగీత మొదలైన పవిత్ర గ్రంథాలు చదువగా నేను విన్నప్పుడు తెలిశాయి. ఏ పరిశీలనా ఏ నిర్ధారణా లేకుండా అంతరంగంలో అనుభవించిన తత్వాన్నే ఈ పుస్తకాలు సంపుటీకరిస్తున్నాయని నిర్ధారణ చేస్తున్నాయని అనిపిస్తుంది".

